నెహ్రూ బాల పుస్తకాలయం

# అనగా అనగా

(రెండవ భాగం)

రచన :

ఎమ్. చౌక్సీ, పి. ఎమ్. జోషి

చిత్రాలు :

పులక్ బిస్వాస్

అనువాదం :

చల్లా రాధాకృష్ణ శర్మ



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# బౌద్ధ సంఘారామం కార్ల

## జీమూత్ – కార్లలోని భిక్షువులు

రమారమి రెండు వేల సంవత్సరాల నాటి మాట. పడమటి కనుమల్లో ఒక పెద్ద కొండ. దాన్ని మనమిప్పుడు కార్ల అంటున్నాము. ఆ కొండ కింద వలురకా అనే ఒక పల్లెటూరు.

ఆ రోజుల్లో దక్కనులో ఎక్కడ చూసినా కీకారణ్యాలూ, క్రూర మృగాలూను. ఆ మృగాలు పల్లెపట్టులకు దరిదాపుల్లో తిరుగుతూ వుండేవి. అయినా, శాతవాహన చక్రవర్తులు గొప్పవారు కాబట్టి, ఆ మహారాజులు దేశమంతటా శాంతి భద్రతలు నెలకొల్పారు. ప్రజలు సుఖపడ్డారు.

ఉత్తర భారతంలోని మైదానాలలో వలె, దక్కనులో మంచి మంచి రహదారులు వుండేవి కావు. ఎటు చూసినా, కొండలూ కనుమలూను.



అవి ఏటవాలుగా ఉండేవి. కాని కొన్ని కాలి బాటలు లేకపోలేదు. వాటి గుండా జంతువులు సరుకులు మోసుకుని వస్తూపోతూ వుండేవి.

క్రీ. శ. 2 వ శతాబ్దిలో వలురకాలో జీమూత్ అనే మేకల కాపరి ఉండేవాడు. ఆ ఊరి గుడిసెలు మట్టి, తడికలతోనూ కట్టబడినవి. ఊరి వారేమో బలిష్ఠులు. కాని దురాశగల ఉద్యోగుల నుంచీ, శత్రుభయం నుంచీ రాజులు కాపాడినంతవరకూ వాళ్ళు హాయిగా ఉండేవారు.

పాపం, జీమూత్‌ది కష్టపు బ్రతుకు. అతనికి తలిదండ్రులు లేరు. అత్తయ్యా మామయ్యల దగ్గర పెరగసాగాడు. వాళ్ల గుడిసె గ్రామం పొలిమేరలో ఉంది. మామయ్య 'కల్హా' వ్యవసాయం చేశాడు. కాని కలిసిరాలేదు. చివరికి ఒక చిన్న మేకల మందమీద ఆధారపడి జీవించ సాగాడు. అత్తయ్య జీమూత్‌ని సరిగా చూసేది కాదు. అందరితో తగవులాడే కల్హాకి పచ్చిక పొలాలు లభించలేదు. కనుక, రోజూ తెల్లవారు జామునే లేచి జీమూత్ మేకల మందను కొండమీదికి తీసుకువెళ్లి సాయం కాలానికి యింటికి తిరిగివచ్చేవాడు. తనతోపాటు ఒక రొట్టె ముక్కను తీసుకు వెళ్లేవాడు. అదే అతని పగటిపూట భోజనం.

ఏటవాలుగా వుండే ఆ కొండను ఎక్కేటప్పుడు సాధారణంగా జీమూత్ మధ్య దారిలో కొంచెంసేపు ఆగేవాడు. అక్కడ ఒక బౌద్ధ సంఘారామం ఉంది. ప్రధాన గుహకు వెళ్లే దారిలో ఉన్న గంభీరమైన ఆ స్తంభాలనూ, సింహద్వారంలో ఉన్న తోరణాన్నీ చూస్తూ అలాగే నిలబడిపోయేవాడు. అలా చూడడం అతనికి సరదా. దారుల్లోనూ, గుహల్లోనూ పసుపు రంగు బట్టలు ధరించి నిశ్చలంగా ఉండే బౌద్ధ భిక్షువులు కనిపించేవారు. వాళ్లవి నున్నని తలలు. వాళ్లల్లో కొందరు ధ్యానంలో మునిగివుండేవారు; మరికొందరు మంద్ర స్వరంలో ఏవో చదువుతూ వుండేవారు. 'బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి' అనే మాటలు అప్పుడప్పుడూ వినిపించేవి.

ఆ భిక్షువులలో మధుసూదన్ అనే ఒక ముసలాయన ఉండేవాడు.



ఆయన తరుచు జీమూత్ బుజం తట్టి ఆశీర్వదించేవాడు. తాను చూస్తున్న ఆ సంఘారామం - విశాలమైన చీకటి మంటపం, అర్ధవర్తులాకారంలో ఉన్న దిబ్బ, ఎత్తయిన స్తంభాలూ, వాటిమీద చెక్కబడిన స్త్రీల పురుషుల మృగాల ఆకుల రూపాలూ — గురించి తెలుసుకోవాలని జీమూత్ ముచ్చట పడ్డాడు. భిక్షువు మధుసూదన్ తనను ఆశీర్వదించేటప్పుడల్లా ఈ సంగతి అడగాలని అనుకునేవాడు. కాని అతను పెదవి కదిల్చేలోపుగా, ఆ భిక్షువు కాస్తా ముందుకు నడిచేవాడు.

అశోక చక్రవర్తి కన్ను మూసిన తర్వాత నాలుగు శతాబ్దాలనాటి ముచ్చట యిది. ఆ మహారాజు పంపిన ప్రచారకుల వల్ల బుద్ధుని సందేశాలు ఆయన రాజ్యంలోనే కాక ఆయన మిత్రుల రాజ్యాలలో కూడ బాగా వ్యాపించాయి. కాగా, బౌద్ధ సంఘారామాలు ఎన్నో చోట్ల వెలిశాయి.

క్రీ. పూ. 2 వ శతాబ్దినుంచీ బౌద్ధ భిక్షువులు కొండలలోనూ, లోతైన కొండదారుల్లోనూ విహారములు నిర్మించడం మొదలుపెట్టారు. ప్రతి సంఘారామమూ చైత్యము (ప్రార్థనా మందిరం) నావరించి ఉండేది. అందులో ఒక స్తూపం ఉండేది. ఆ స్తూపం కింద చాలా లోతుగా బుద్ధుని అవశేషం ఒకటి ఉంటుంది. కార్లలో ఉన్న సంఘారామం దక్కనులోని ప్రముఖ బౌద్ధ విహారాలలో ఒకటి.

ఈ సంఘారామంలో ప్రజలకోసం ఒక ఆలయమూ, భిక్షువులు నివసించేందుకు ఒక విహారమూ, బుద్ధుని సందేశాలు బోధించేందుకు ఒక కళాశాలా ఉండేవి. కొంతమంది యువ భిక్షువులకు ఒక వృద్ధ భిక్షువు గురువుగా ఉండేవాడు. ఆయన ఆ భిక్షువుల చదువు సంధ్యలు అజ కనుక్కునేవాడు. మతమునకూ వేదాంతమునకూ సంబంధించిన చర్చలు విహారములలో జరిగేవి. వాటిని వృద్ధ భిక్షువులు నిర్వహించేవారు. వాటిలో భిక్షువులూ సామాన్యులూ పాల్గొనేవారు.

గ్రామస్థులతో విహారంలోని భిక్షువులు సన్నిహిత సంబంధం పెట్టుకునేవారు. దైవభక్తులు ఆలయానికి వెళ్లేవారు. పండగ రోజుల్లో చిన్న చిన్న దీపాల వరుసలు గుడిలో కనిపించేవి. పగలూ రాత్రీ కూడా గుడికి వెళ్లి, భక్తులు కానుకలు సమర్పించేవారు.

జీమూత్‌ది ఒంటరి బ్రతుకు. నోరు మంచిది కాకపోవడంవల్ల, వాళ్ల మామయ్యా అత్తయ్యా అంటే ఊరిలో మంచి పేరు లేదు. పైగా మేకలు తోలుకుని పొద్దున వెడితే మళ్లీ పొద్దువాలే వేళ యింటి ముఖం పట్టే వాడు జీమూత్. కనుక కొండలూ బండలూ అతని నేస్తములు.

ఒక రోజు సాయంకాలం కల్హా తన గుడిసె బయట కూర్చుని గ్రామస్థులతో ఏదో మాట్లాడుతున్నాడు. అప్పుడు జీమూత్ యిలా అడిగాడు: "కొండమీద వున్న ఆ విహారంలో పసుపు రంగు బట్టలు కట్టుకునే భిక్షువులు ఎవరు మామయ్యా?"

"వాళ్లా! బిచ్చమెత్తుకునే వాళ్లు. వాళ్లకు పనీ పాటూ యేమీ లేదు. బిచ్చంకోసం ఊరిమీద పడతారు'' అన్నాడు మామయ్య.

"భిక్షువులు బిచ్చగాళ్లు కారు" అన్నాడు ఒక ముసలాయన, ఉండబట లేక. ఆయన యింకా యిలా అన్నాడు. "వాళ్లు లేనివారు. అన్నం కావాలని వాళ్లడగరు. ఒక పడుచు భిక్షువు భిక్షా పాత్రతో ప్రతి రోజూ మన గ్రామానికి రావడం నిజమే. కాని ఎవ్వరినీ యేమీ అడగడు. అయినా, కొందరు ఉదారులు ఆయనకి సంతోషంతో భిక్ష వేస్తారు."

"వాళ్ల వద్ద ధాన్యం, నూనె వున్నాయి గదా!" అడిగాడు కల్హా.

"అవును. రాజులూ, ధనికులూ కొన్ని గ్రామాలు వాళ్లకు దానం చేశారు. వాటివల్ల వచ్చే ఆదాయం విహారానికి వెడుతుంది. కొందరు తోరణాలూ స్తంభాలూ మొదలైన వాటిని ఉచితంగా కట్టించారు" అన్నాడు ముసలాయన.



"కొందరు భిక్షువులు వ్యాధిగ్రస్తులకు మందు మాకు లిచ్చి సహాయ పడుతూ వుంటారు" అన్నాడు మరొకడు.

ఒకాయన యిలా అన్నాడు. "ఒకసారి మా ఆవు తప్పిపోతే, అప్పుడు భిక్షువులు దాన్ని వెతకడంలో నాకు సహాయం చేశారు."

"కొన్నేళ్ల క్రితం పంటలు సరిగా పండలేదు. ఆ యేడు భిక్షువులు ధాన్యం పంచిపెట్టి, ఎన్నో కుటుంబాలను కాపాడారు'' అని ఒకాయన చెప్పాడు.

"మిగిలిన నమయాల్లో విహారంలో ఉండే ధాన్యం ఎవరికి ఉప యోగపడుతోంది?" అడిగాడు కల్హా కోపంగా.

"భిక్షువులకూ వాళ్ల అతిథులకూను. అతిథులంటే బాటసారులూ, యాత్రికులూ, విద్యార్థులూను. భిక్షువులు ఇలా మంచి పనులు చేస్తారు కాబట్టి, వాళ్ల అవసరాలను తీర్చడానికి ప్రజలు సంతోషంగా ముందుకు వస్తారు. కాని వాళ్ల అవసరాలేమో తక్కువ" అన్నాడు ఒక వృద్ధుడు.

"ఆ చైత్యం చూడండి. దానిమీద చెక్కబడిన ధనికుల బొమ్మలు చూడండి" అని గొణిగాడు కల్హా.

"నిజమే. చైత్యం చూడ ముచ్చట గొలుపుతోంది. అది అలాగే వుండాలి. ఎందుకంటె స్తూపం కింద బుద్ధుని కేశం ఒకటి భద్రపరచ బడింది" అన్నాడు ఒకాయన.

"ఆడంబరంగా కనిపించే ఆ ధనవంతుల బొమ్మలు దాతలవీ వారి తలిదండ్రులవీను. కాని భిక్షువులు నిరాడంబరులు. వాళ్లవి నున్నని తలలు. పసుపు రంగు బట్టలు ధరిస్తారు. వాళ్ల దుస్తులవలె, వాళ్ల గదులుకూడా నిరాడంబరంగా ఉంటాయి. కొండ పక్కగా కొన్ని గదుల వరసలు చూసే ఉంటారు మీరు. ఒక్కొక్క గదిలోనూ ఒక్కొక్క భిక్షువు వుంటాడు. కొన్నిట్లో యిద్దరుంటారు - గురువూ శిష్యుడూను. విశాలంగా ఉండే గదుల్లో యువ భిక్షువులూ అతిథులూ పడుకుంటారు. నన్నని రాతి అరుగూ రాతి దిండూ వాళ్ల పడక."



ఈ విషయాలు ఆసక్తిగా విన్నాడు జిమూత్. ఉన్నట్టుండి వాళ్ల అత్తయ్య బొబ్బలు వినిపించాయి. "సోమరి వెధవా! పొద్దస్తమానం ఆడుకుంది చాలక, యిప్పుడు పెద్దవాళ్ల మాటలు వింటున్నావా? రేపు మేకల్ని ఆలస్యంగా తీసుకు వెడదామనా?" అంతే. జీమూత్ యింట్లోకి వెళ్లబోతుంటే, ఆమె అతనికి ఒక దెబ్బ అంటించింది.

ప్రతి రోజూ జీమూత్ కొండ మీదికి మేకల్ని తోలుకు వెడుతూ వుండేవాడు. విహారమును దాటేటప్పుడు భిక్షువులతో మాట్లాడాలని అనుకునేవాడు. కాని తగిన అవకాశం దొరకలేదు.

ఒకనాడు కల్హాకి జ్వరం వచ్చింది. అతనికి సపర్యలు చేయడం వల్ల, కొంచెం ఆలస్యంగా బయలుదేరాడు జీమూత్. దారిలో ఆజాను బాహువైన ఒక యువ భిక్షువుని చూశాడు. అతను ఎవరినీ యేమీ అడగడం లేదు. భిక్ష వేసినవారికి కృతజ్ఞత మాత్రం తెలిపేవాడు.

ఆ భిక్షువు పేరు ఆనంద్. కార్లలో విద్య పూర్తి చేసుకునేందుకు అతను త్రిరశ్మి (నాసిక) విహారం నుంచి వచ్చాడు.

ఆనంద్ భిక్షా పాత్రను మెల్లిగా చాపేవాడు. గ్రామస్థులు భిక్ష వేసేవారు. కొందరు గృహిణులు బియ్యం వేసేవారు. కొందరు గడ్డ పెరుగుని ఆకులో చుట్టి యిచ్చేవారు. జీమూత్ వద్ద రోజుకంతా సరిపడే ఒక్క రొట్టె ఉండేది. ఆ భిక్షువుకి ఏదన్నా యివ్వాలని అతని కోరిక. అందువల్ల సగం రొట్టెను భిక్షువుకి ఇచ్చివేశాడు. ఆనంద్ నవ్వుతూ కృతజ్ఞత తెలిపాడు.

ప్రతి రోజూ భిక్షువులకు తన రొట్టెలోంచి ఒక భాగం యివ్వాలని జీమూత్ నిశ్చయించుకున్నాడు. "రోజూ మీ భిక్షాపాత్రలో నా రొట్టెలో ఒక భాగం వెయ్యడానికి అనుమతిస్తే, నేనెంతో సంతోషిస్తాను. కాని నేను పొద్దున్నే బయలుదేరాలి గదా. కనుక ఒక స్తంభం పక్కన మీ భిక్షాపాత్రను ఉంచితే, అందులో రొట్టె పడేస్తాను" అన్నాడు. కాని అతని రొట్టె ముక్కను తీసుకొనేందుకు గాని, అతన్ని నిరుత్సాహ పరచ డానికి గాని భిక్షువుకి మనస్కరించలేదు. "మధుసూదన్ భిక్షువుని అడిగి చెపుతాను" అని బదులు చెప్పాడు ఆనంద్.

తర్వాత ఆ వృద్ధ భిక్షువుని కనుక్కున్నాడు ఆనంద్. "ఆ పిల్లవాని ఉత్సాహంలో నీళ్ళు పొయ్యకూడదు" అని ఆయన సలహా యిచ్చాడు.

కొన్నాళ్ల తర్వాత ఆ భిక్షువు లిద్దరూ తనకోసం వేచివుండడం గమనించాడు జీమూత్. "సంఘానికి నువ్వు సహాయం చేద్దామను కుంటున్నావు. చాలా కృతజ్ఞులం. ప్రతి యేడవ రోజున యిక్కడ ఒక





భిక్షాపాత్రను ఉంచుతాము. ఆ రోజు చాలామంది అతిధులు వస్తారు కనుక ఆహారం ఎక్కువగానే కావాలి. నీ రొట్టెను ఎలా విభజించాలో చెబుతా విను. మొట్టమొదట రొట్టెను రెండు ముక్కలు చెయ్యి. ఒక ముక్కను మళ్లీ మూడు ముక్కలు చెయ్యి. వాటిలోంచి ఒక ముక్కను ఈ పాత్రలో వెయ్యి'' అన్నాడు మధుసూదన్.

"అయితే, చాలా చిన్న ముక్కగదా మరి!" అని అడిగాడు టీమూర్.

"ప్రేమతో సమర్పించే చిన్న కానుకల్ని బుద్ధ భగవానుడు స్వీకరిస్తాడు. ఈ చిన్న కానుకలే చివరికి పెద్దవిగా తయారవుతాయి. ఈ విహారాన్ని చూడు. ధనికులూ, దరిద్రులూ అయిన దాత లెందరో ఎన్నో యేళ్ళుగా దానాలు చేశారు. తత్ఫలితంగా నేటికి ఈ చక్కని ప్రార్థనా మందిరం ఏర్పడింది."

"ఇక నువ్వు వెళ్ళు నాయనా! ఒక రోజు ఆనంద్ నీకు బుద్ధ భగవానుని గురించీ, ఆయన దివ్య సందేశం గురించీ వివరిస్తాడు" అన్నాడు వృద్ధ భిక్షువు నవ్వుతూ.

## అందమైన రాతి ఇల్లు

ఆ తర్వాత కొన్నాళ్లదాకా ఆ భిక్షువులకు జీమూత్ కనిపించలేదు. అతనికి బాగా జ్వరం కాస్తున్నట్టు ఆనంద్ తెలుసుకున్నాడు. వెంటనే ఆ భిక్షువు కొన్ని మూలికలూ ఆకులూ తీసుకుని బయలుదేరాడు. ఒక్క వారంలో జీమూత్ కోలుకున్నాడు.

జ్వరం రావడం మూలంగా ఆనంద్‌కీ జీమూత్‌కీ మధ్య స్నేహం బలపడింది. అందువల్ల అతను భిక్షువుని ఎన్నో ప్రశ్నలు అడిగాడు.

చైత్యం సింహద్వారం వద్ద ఎత్తయిన ఒక స్తంభం ఉంది. దాని పైభాగాన నాలుగు జంతువుల బొమ్మలున్నాయి. "ఇవేమిటండీ?" అని అడిగాడు జీమూత్.

"ఇవి సింహాల బొమ్మలు. ఇవి ఉత్తర భారతంలో కనిపిస్తాయి. స్తంభాల పైభాగాన ఒక్కొక్కసారి వీటిని చెక్కుతారు." స్తంభం మీద ఈ పంక్తులు కూడా చెక్కబడినాయి: 'ఈ స్తంభం మహారథి గోతి కుమారుడైన అగ్నిమిత్రానకునిచే దానం చేయబడింది.'

"అతను యిక్కడే వుండి దీన్ని కట్టాడా?" అడిగాడు జీమూత్.

నవ్వుతూ ఆనంద్ చెప్పాడు. "అతను కట్టలేదు. ప్రజలిచ్చిన కానుకల వల్ల ఈ గుహలు కట్టబడినవి. రాజులూ, ప్రముఖులూ, బుట్టలల్లేవారూ, చేతిపనులు చేసుకునేవారూ, రైతులూ ఎందరో సహాయం చేశారు. మా తాపీ పనివారు వీటిని కట్టారు."

"అయితే నేనూ కట్టవచ్చా?" అడిగాడు జీమూత్ జంకుతూ.

"రకరకాల పనులు చేసేందుకూ నేర్పరులైన పనివాళ్ల సంఘాలున్నాయి. పని బాగా వచ్చిన తర్వాతనే సంఘంలో చేర్చుకుంటారు" అని వివరించాడు ఆనంద్.

స్తంభం వెనక ఒక బొమ్మ ఉంది. దాన్ని చూపిస్తూ ఆనంద్ ఇలా అన్నాడు: "ఆ బొమ్మలోని వారు దేవపాలుడూ అతని భార్య క్షమానూ.

వాళ్ళు కర్షకులో ఉంటారు. ఈ విహారానికి వాళ్ళు చాలా భూదానం
చేశారు. కనుకనే, వాళ్ల జ్ఞాపకార్థంగా ఈ బొమ్మ చెక్కబడింది."

"ఆ భూముల నుంచి మాకూ మా అతిథులకూ కావలసినంత
ధాన్యం లభిస్తుంది. భిక్షువులకి కావలసింది పసుపు రంగు బట్టలూ తక్కువ
ఆహారమూను. ఉదారులు మా అవసరాలు తీరుస్తారు. అందువల్ల
చదువుసందెల్లోనూ ధర్మబోధలోనూ కాలం గడపడానికి మాకు వీలవు
తోంది. ఒక్కొక్కప్పుడు కొంత ధాన్యం అమ్ముతాము. అందువల్ల వచ్చే
ఆదాయంతో దీపాలు వెలిగించేందుకు కావలసిన నూనె కొంటాము."

"లోపలికి రా నాయనా! ఎడమ నుంచి అయిదో స్తంభం చూడు.
అది ధేనుకటకానికి చెందిన ధమ్మయవనుడనే ఆయన దానం చేసింది.
మూడోదీ మరికొన్ని కూడా యవనులు దానం చేసినవే. యవనులు మన
దేశంవారు కారు."

మధుసూదన్ భిక్షువు యింకా యిలా అన్నాడు: "ఈ బోధి
తోరణం చూడు. అందంగా ఉంది కదూ! బోధి వృక్షం కిందనే బుద్ధుడికి
జ్ఞానోదయమయింది. అందుకు గుర్తుగా ఈ తోరణం నిర్మించబడింది.
దీని ద్వారా లోపలికి వచ్చేవారు సత్యం జ్ఞానం ఆశించి రావాలి. ఇప్పుడు
లోపలికి వచ్చే తీరిక నీకు లేకపోతే, ఆ తోరణం కింద నుంచుని యీ
మాటలు ఉచ్చరించు. 'ఓం మణి, పద్మే ఓం' (బుద్ధుడిప్పుడు పద్మ
సింహాసనం మీద కూర్చున్నాడు). బుద్ధుని అనుగ్రహం నీకు కలుగు
తుంది. నువ్వు ఆపదలో ఉన్నప్పుడు, ఆ అనుగ్రహమే నిన్ను కాపాడు
తుంది; నీకు వచ్చిన కష్టం తొలగిపోతుంది."

ఆనంద్ అశోకచక్రవర్తిని గురించి చెప్పాడు. యుద్ధంలో
జయించినా, ఆ హింసాకాండను చూచి ఆయన సహించలేకపోయాడు.
తర్వాత బుద్ధదేవుని ఉపదేశాలను దూరదేశాలకు సైతం వ్యాపింప
చేసేందుకు కృషి చేశాడు.

పశ్చిమ భారతంలో ఉన్న యితర గుహాలయములను గురించి



కూడా ఆనంద్ వివరించాడు. కార్లకు దగ్గరలో ఉన్న భాజ విహారం, నాసికలోని విహారం గురించి వివరించాడు.

బుద్ధుని ఉపదేశాల ప్రభావం ఇంతా అంతా కాదని ఆనంద్ తెలిపాడు. మన దేశంలోని రాజులే కాక ఇతర మతాలకు చెందినవారు కూడా బౌద్ధ భిక్షువుల్ని ఆదరించారు; వాళ్లకు తోడ్పడ్డారు. క్షత్రపులైన

నహపానుని అల్లుడు అశ్వదత్తుడనే అతను వేయించిన కార్ల, నాసిక శాసనాల వల్ల ఆతను బ్రాహ్మణులకూ బౌద్ధులకూ దానాలు చేసినట్లు తెలుస్తోంది. బ్రాహ్మణులకు గోదానం చేశాడు. నాసికలోని బౌద్ధ విహారం కోసం 800 కొబ్బరిచెట్ల తోపు నొకటి దానం చేశాడు. విదేశీయులైన క్షత్రపుల తర్వాత అధికారానికి వచ్చిన శాతకర్ణి రాజులు కూడా దానాలు చేయడమే కాకుండా, తమ పూర్వులు చేసిన వాటిని ఖాయ పరిచినట్లు కార్ల, నాసికలలోని శాసనాలు స్పష్టం చేస్తున్నవి. తలుపు పైభాగానే ఉన్న వ్రాతబట్టి గౌతమీపుత్రుడు తమ పూర్వులు భిక్షువులకు దానం చేసిన కరాజక అనే గ్రామమును ఖాయం చేసినట్లు తెలుస్తోంది.

భిక్షువులకు పేదవారు కూడా కానుకలు సమర్పించాలని అభిలషించారు. తోరణం క్రింద రాతి పెట్టెను చూపిస్తూ ఆనంద్ యిలా అన్నాడు: "దీన్ని ఆషాఢమిత అనే భిక్షుకి సమర్పించింది. దీనికోసం ఆమె ఎందరో పేదవారివద్ద నుంచి విరాళాలు సేకరించి వుంటుంది."

భూతపాలుడనే ఒక ధనిక వర్తకుడు సింహద్వారానికి రెండు వైపులా ఉన్న అయిదు వరుసల చిత్రఫలకాలను దానం చేశాడు. అవి చూడ చక్కనివి. దూరదేశాల నుంచి తరచుగా సముద్రం ద్వారా వచ్చే యవనులను గురించి తెలుసుకోవాలని జీమూత్ అభిలషించాడు. చాలాకాలం క్రిందట సికందర్ అనే యువ విజేత నాయకత్వంలో యవనులు మన దేశానికి భూమార్గం ద్వారా వచ్చారనీ, తర్వాత వాళ్ళు వెళ్ళిపోయారనీ, ఆనంద్ చెప్పాడు. కాని యిప్పుడు శాంతి కాముకులై వర్తకులుగా వస్తున్నారు. వాళ్ళకు బౌద్ధ ధర్మములంటే చాలా ఆసక్తి.

దానధర్మాలు చేసినవారిలో యవనులూ ఇతరులూ ఉన్నారని జీమూత్ తెలుసుకున్నాడు. ధేనుకటకానికి చెందిన సింహదత్తుడనే సుగంధ ద్రవ్యాల వ్యాపారీ, శామినా అనే ఒక వడ్రంగి - యిలా ఎందరెందరో బుద్ధదేవునీ, భిక్షువుల్నీ ఆదరించిన విషయం తెలుసుకుని జీమూత్ ఆశ్చర్యపడ్డాడు.

## చిఱుతపులి-మేక

ఒకరోజు సాయంకాలం జీమూత్ తన మేకల మందలో ఒక నల్లని మేకపోతు తక్కువైనట్లు తెలుసుకున్నాడు అది కనుక కనిపించక పోతే, కల్హా అతన్ని ఉరికే విడిచిపెట్టడు.

చీకటి పడుతోంది. అందువల్ల ఉన్న మేకల్ని యింటికి తోలుకు వెళ్లి, తప్పించుకు పోయిన మేక కోసం వెతకాలని అనుకున్నాడు.

దారిలో ఒక భిక్షువు కనిపించి "త్వరగా వెళ్లు నాయనా. ఒక చిరుతపులి తిరుగుతోందని గ్రామస్థులు చెపుతున్నారు" అన్నాడు.

అప్పుడు జీమూత్, 'చిరుతపులి తిరుగుతున్నా సరే, నేను వెతకాల్సిందే' అనుకున్నాడు మనస్సులో. అంతా నిద్రపోతూ వుండగా, జీమూత్ కొండమీదికి బయలుదేరాడు.



కొండ ఎక్కుతూ కంట తడిపెట్టాడు. ఒక మూల భయం. మరొక మూల అలసట. అప్పుడు మధుసూదన్ భిక్షువు 'అపదలో ఉన్నప్పుడు ఓం మణి, పద్మే ఓం అని బుద్ధుణ్ణి తలుచుకో' అని చెప్పిన మాటలు గుర్తుకి వచ్చాయి. అంతే. జీమూత్ భయం తొలగిపోయింది.

పైకి ఎక్కాడు. చివరికి ఒక చోట 'మే మే' అని సన్నగా వినిపించింది. ఒక పెద్ద బండ మీద మేకపోతు కనిపించింది.

సంతోషంగా మేకపోతు 'మే మే' అంది. కాని తర్వాత ఆ సంతోషం భయంగా మారిపోయింది. జీమూత్ అటూ యిటూ చూశాడు. చీకట్లో రెండు పచ్చని కళ్లు మెరిశాయి. ఒక నల్లని రూపం తన వైపే వస్తోంది. అదే చిరుతపులి!



వెంటనే జీమూత్ తన చేతనున్న కర్రను ఝళిపించాడు, పులిని బెదరగొట్టాలనే వుద్దేశంతో.

ఆ తర్వాత ఏం జరిగిందో జీమూత్‌కి స్పష్టంగా తెలియదు. బహుశా పులి మేకపోతు మీదికి ఉరికి వుంటుంది. కాని సరిగ్గా బండను చేరు కోలేక, అది కిందవున్న రాతినేల మీద గభీమని పడివుంటుంది. బెదరి పోయిన మేక బండమీది నుంచి కింద పడింది. తలవని తలంపుగా పులి దెబ్బకు, దాంతోపాటు, జీమూత్ కూడా కింద పడ్డాడు. దాని దవుడలకు దగ్గరగా పడ్డాడు! చిరుతపులి విడుస్తున్న వేడి గాలి జీమూత్‌కి తగిలింది. 'ఓం మణి, పద్మే ఓం' అని ఉచ్చరించాడు. ఉన్నట్టుండి



# మథురలోని కార్ఖానాలు

## దేశద్రిమ్మరి రాక

అది క్రీ. శ. రెండవ శతాబ్ది మధ్య భాగం. కుషాన్ చక్రవర్తులు పరిపాలించే రోజులు. వారి ఏలుబడిలో అతి ప్రాచీనమైన మథురానగరం చాలా అభివృద్ధికి వచ్చింది. ఆ రోజు ఎండ బాగా కాస్తోంది. శిల్పులు నివసించే ప్రాంతంలో ఇరుకైన వీధులూ కిటకిటలాడే యిళ్లూను. ఆ ప్రాంతం పనిపాటులతో సందడిగా ఉంది.

ఒక చిన్న గుడిసెలో కేతకి అనే ఆమె దీపం వంక చూస్తూ కూర్చుంది. ఆమె వెనక ఒక గది. అదే వాళ్ల పడక గది, పనిపాటులు జరిగే గది-అన్నీను. అక్కడ ఆమె మామగారు మథురలోని ఎర్ర రాతిని చెక్కుతున్నాడు. ఇంకా కొద్ది సేపట్లో ఆమె భర్త వస్తాడు అతను కూడా శిల్పి. ఎర్ర రాళ్లు, చుక్కల చుక్కల రాళ్లు మొదలైనవాటిని చెక్కుతాడు. విగ్రహాలు, ఫలకాలు మొదలైనవి తయారుచేస్తాడు.

ఆమె భర్త వచ్చాడు. వస్తూనే "ఇంకా ఆ వెధవ కోసం చూస్తూ కూర్చున్నావన్న మాట! రేపేమో గుడికి వెళ్లి, వాడి రాక కోసం దేవుణ్ణి ప్రార్థించు'' అన్నాడు కోపంగా.

"వాడి క్షేమం కోసం రాకకోసం నేను ప్రార్థిస్తాను. మీకోసం, మామ గారి కోసం. మిగిలిన పిల్లల కోసం ప్రార్థించడంలా . . ." అంది ఆమె.

"మిగిలిన పిల్లలు మంచివాళ్లు. రాళ్ల గనుల్లో పని చేస్తున్నారు; రాతిని చెక్కుతున్నారు.''

తర్వాత ఆమె భర్త ముందు కంచం ఉంచింది. దాని చుట్టూ అన్నం, పెరుగు, కూరల గిన్నెలు-మట్టివి లోహంతో తయారైనవీ-అమర్చింది. అతను యిలా అన్నాడు. "నిజంగా వాళ్లు మంచి వాళ్లే. మార్చిలో కూడా ప్రత్యేకత లేకపోలేదు నా కింకా గుర్తుంది. వాడు

తొమ్మిదేళ్ల కుర్రవాడుగా వున్నప్పుడు, రాతితో కోతి బొమ్మ ఒకటి తయారుచేశాడు. ప్రశ్నలు అడిగేటప్పుడు వాడి కళ్లు ఎలా మెరిసి పోయేవని!"

"చూడు, ఆ మెరిసే కళ్లు వాణ్ణి ఎంత దూరం తీసుకుపోయాయో! దండలు గుచ్చేవాడి కూతురితో వస పోసిన పిట్టలా ఎప్పుడూ మాట్లాడుతూ వుండేవాడు. అందుకని వాణ్ణి నేను కొట్టాను. అంతే; గుర్రాల వ్యాపారితో వాడు కాస్తా పారిపోయాడు. పారిపోయి పన్నెండేళ్లయింది. ఇప్పుడెక్కడున్నాడో యేమిటో!" అన్నాడు మళ్లీ.

రాత్రి అయింది. ఆ ప్రాంతం ప్రశాంతంగా ఉంది. చీకటి అలుముకుంది. రాత్రికంతా దీపాలకు సరిపడే చమురు వాళ్లదగ్గర లేదు.

ఆ మరునాడు ఒక చిన్న పిల్లను వెంటబెట్టుకుని కేతకి గుడికి వెళ్లింది. పారిపోయిన కొడుకు తిరిగివస్తే, ఆ పిల్లని అతనికిచ్చి పెళ్లి చేయాలని కేతకి కోరిక.

ఇంతలో ఒక జట్టుగా బయలుదేరిన వర్తకులు మథురను సమీపించారు. వాళ్లలో ఒకడు మిగిలిన వారిని తొందరపెడుతున్నాడు. అతనిలో ఓర్పు తక్కువయింది. నిజానికి, మథురలో ఉన్నన్ని చిలుకలు గాని, కదంబ వృక్షాలు, వేపచెట్లు గాని మరెక్కడా లేవు.

ఉన్నట్టుండి అతని చూపు తల్లిమీద పడింది. ఆమెింకా నడుము ఒంగలేదు; పొడుగ్గా ఉంది. సరిగా అదేవేళకు కేతకి చూపు కూడా అతనిమీద పడింది. "నన్ను గుర్తుపట్టావా అమ్మా!" అని అడిగాడు.

"పిచ్చి సన్యాసి.. తొందరగా వెళదాం పద మనింటికి" అంది ఆమె.

"ఒకవేళ నాన్న నన్ను వెళ్లగొడితే!" అన్నాడు మార్చి.

"మీ నాన్నది కొంచెం తొందరపాటు స్వభావం కావచ్చు. కాని నీ రాక కోసం ఆయనకూడా తహ తహ లాడిపోతున్నారు" అంది. తర్వాత ఆ చిన్న పిల్ల వైపు తిరిగి "ఇక మీ యింటికి వెళ్లిపోమ్మా" అంది కేతకి.

ఆ తర్వాత ఊరి బావివద్ద తల్లీ కొడుకులు పాటల్లో మునిగిపోయారు.

ఆ తర్వాత తల్లీ కొడుకులు ఇల్లు చేరుకున్నారు. కొడుకుని చూసే సరికి తండ్రి ముఖంలో క్షణ కాలం సంతోషం వెల్లి విరిసింది. "అయితే, నువ్వు తిరిగి వచ్చావన్న మాట" అన్నాడు చిరచిరలాడుతూ.

వెంటనే కేతకి వాళ్లిద్దరికీ అన్నం వడ్డించింది. కిమ్మనకుండా యిద్దరూ అన్నం తిన్నారు.

భోజనం చివరలో తండ్రి కొంచెం కఠినంగానే అడిగాడు: "ఇప్పుడేం చేయదలుచుకున్నావు నువ్వు?"

"పని తెలిసిన వాడికి మథురలో గాని మరో చోట గాని పని ఎప్పుడూ వుంటుంది" అని ప్రశాంతంగా జవాబు చెప్పాడు కొడుకు.

అందుకు తండ్రి "అయితే ఆ శక జాతీయుల వద్ద ఏం పని నేర్చుకున్నావు? వాళ్లు వట్టి అబద్ధాలకోరులూ, దొంగలూను" అన్నాడు.

"రాజులూ ధనికులూ శకుల్ని అంగరక్షకులుగా సేవకులుగా నియ



మించుకుంటారు. మన మథురలోని శిల్పులు వెడల్పయిన ముఖాలూ పొడుగాటి ఖడ్గాలూ, ముతక బట్టలూ, గుర్రపు రౌతులు ధరించే బూట్లూ గల శక సైనికుల రూపాలు చెక్కారు. మనల్ని కొంతకాలం శక జాతీయులు పరిపాలించిన సంగతి నీకు తెలుసుగా. ప్రస్తుతం మనల్ని పాలిస్తున్న కుషాన్లు కూడా శకుల మాదిరిగా కనిపిస్తారు."

"రాజులు మన మీద ఎక్కువగా పన్నులు వెయ్యనంతవరకూ, సైనికులు మనల్ని దోచుకోనంత వరకూ ఎవరు పరిపాలిస్తే మనకేం? అది సరే, మథురానగరం శిల్పి ఆ గుర్రం వ్యాపారులతో ఎందుకు సంబంధం పెట్టుకోవాలి?"

"ప్రయాణం చేసేటప్పుడు గుర్రం వ్యాపారి మంచి నేస్తం. అతన్ని ఎదిరించేందుకు ఎవరూ సాహసించరు. వాళ్ల గుర్రాలు తంతాయి. గుర్రం వ్యాపారినుంచి విడివడిన తర్వాత, నేను కొందరు వర్తకులతో కలిసి ప్రయాణం చేశాను. వాళ్లు గుంపుగా బయలుదేరుతారు. వాళ్ల



నాయకుడు అనుభవజ్ఞుడై వుంటాడు. పైగా సాయుధులైన అంగ రక్షకుల్ని నియమిస్తారు. వాళ్లు దేశ దేశాల కథలూ, తమ వస్తువులను గురించీ, చెపుతారు. ఉత్తర దిక్కు నుంచి మెత్తనీ వెచ్చనీ ఉన్ని గుడ్డలు వస్తాయి. చైనా నుంచి ఒంటెల ద్వారా ఎడారీ కొండలూ దాటి చక్కని గుడ్డలు తెస్తారు. ఆ చీనాంబరాలంటే చాలా మందికి యిష్టం. యవనుల దేశం నుంచి బాడీల నిండా ద్రాక్షాసవం పగడాల దండలూ తెస్తారు. వాటిని మన రాజులూ ప్రముఖులూ ఉపయోగిస్తారు."

అప్పుడు మార్చి తాతయ్య యిలా అడిగాడు: "నువ్వు తిరిగిన దేశాలలో ఎక్కడైనా మన వస్తువుల్ని చూశావా?"

"చూడకేం, చాలా చూశాను. యవనులు, వాళ్లు తీసుకువచ్చే సరుకుల కంటె, ఎక్కువగానే తీసుకువెడతారు. రకరకాల ముదురు రంగుల గుడ్డలు, నన్నని నూలు వస్త్రాలు, జరీ బుటా వస్త్రాలూ, ముత్యాలు, నగలు, రత్నాలు, సువాసన ద్రవ్యాలు, రంగులు, మందులు, మిరియాలు, లవంగపట్ట, దంతం, ముచ్చటైన దంతం సామాన్లు - మొదలైనవాటిని తీసుకు వెడతారు. కుషాన్ రాజుల వేసవి రాజధానీ నగరమైన కపీసాలో (కాబూలుకి ఉత్తరంగా) మథురలో తయారైన పనితనం ఉట్టిపడే దంతం సామాన్లు చూశాను" అన్నాడు మార్చి.

"ఎక్కడ చూసినా మథురలోని రాతితో మలచిన వస్తువులు కనిపించాయి. కాబూలు నది మొదలుకొని మన యమునదాకా శాంతి నెలకొని వుంది. ఈ రాజ్యం వర్తకానికీ, చేతిపనులకూ, సిరిసంపదలకూ ఆటపట్టుగా వున్నట్టు కనిపించింది. నేనిప్పుడు ఆ వర్తకుల్ని కలుసుకోవ డానికి వెళ్లాలి. చెక్కడానికేమన్నా పనికిరాని ముక్కలున్నాయా? విరిగిపోయిన రాతిఫలకాలైనా సరే-" అన్నాడు మార్చి.

"బీటువారిన ఒక ఫలకం వుంది. అది అక్కర్లేదు" అన్నాడు తండ్రి.

చీకటి పడింది. అయినా తల్లీ కొడుకులు నీళ్ల కుండల పక్కన కూర్చుని రాత్రి పొద్దు పొయ్యేదాకా మాట్లాడుకున్నారు.

## దేశద్రిమ్మరి చెప్పిన కథలు :

ఒకనాటి సాయంకాలం కొడుకు ఇంటికి రాగానే మార్చి వాళ్ల తాతయ్య "ఇప్పుడు మా మనవుడు చెప్పే కథలు వినాలి" అన్నాడు.

మార్చి ప్రారంభించాడు. "ఇప్పుడు రహదారుల గుండా నిర్భయంగా వెళ్లవచ్చు కాబట్టి, వర్తకులే కాక భిక్షువులూ విద్యార్థులూ కూడా రాకపోకలు సాగిస్తున్నారు. విద్యార్థులు కూడా బాగా చదువుకున్నవారే. ఒక విశ్వవిద్యాలయంలో ఏడేళ్లు చదివి, యింకో విశ్వవిద్యాలయంలో మరో యేడేళ్లు చదవడం కోసం వాళ్లు వస్తూ పోతూ వుంటారు. మన కొత్త పరిపాలకులైన శకులు, పహ్లావులు, కుషానులు మొదలైన వాళ్ల దేశాలు కూడా నేను చూశాను. ఇందుకు కొండలు దాటి వెళ్లాలి."

"వాళ్లు మన దేశానికెందుకు రావాలి?" అడిగాడు తాతయ్య.

"మంచు కొండలకు అవతల ఉండే దేశాలు మన దేశంలోని నదీతీర ప్రాంతాలవలె సారవంతమైనవి కావు. ఉంటే ఉన్నతమైన పర్వతాలు; లేదా చల్లని యెడారులూ, మేకలను మేపేందుకు ఉపయోగపడే పచ్చిక మైదానములూను. చలికాలం బాగా తీవ్రంగా ఉన్నప్పుడూ, శత్రువులు దండెత్తి వచ్చినప్పుడూ, అక్కడి ప్రజలు ఇతర ప్రాంతాలకు తరలి వెడతారు. కొందరేమో కలకలలాడే పట్టణాలూ సారవంతమైన పొలాలూ గల మన దేశం వంటి చోట్లకి వస్తారు. ఈ దేశ ద్రిమ్మరులు సాధారణంగా మనకంటె బలిష్ఠులై ఉంటారు. ఒకవేళ మనల్ని జయించినా, వాళ్లు మన విజ్ఞానాన్ని మాత్రం గౌరవిస్తారు. యవనులు, శకులు, పహ్లావులు మొదలైన వాళ్లు మొట్టమొదట మనదేశంలో పంచనదుల ప్రాంతానికి వచ్చి, ఆ తర్వాత యితర ప్రాంతాలకు వెళ్లినవాళ్లే. కుషానులూ ఇంతే. కుషాను చక్రవర్తి కనిష్కుని అత్యద్భుతమైన శిలా విగ్రహం మన మథురలో తయారుచేయబడిందే. చైనా సరిహద్దుల నుంచి బయలుదేరి మొట్టమొదట కుషానులు ఇరాను సరిహద్దులకు వళ్ళి



మాఖిముఖంగా ప్రయాణం చేశారు. తర్వాత దక్షిణంగా ప్రయాణంచేసి, బాల్ఖ్ నది నుంచి కాబూల్ నదిని చేరుకున్నారు. ఆ తర్వాత ఉన్నత పర్వతాలు దాటి పంచ నదుల ప్రాంతం చేరుకున్నారు. చిట్టచివరికి మన యమునా తీరానికి వచ్చారు. వాళ్ల చరిత్రనంతా శిల్పులు వాళ్ల విగ్రహాలలోనూ నాణాలలోనూ వదిల పరిచారు. దేశ దిమ్మరి అయిన గుర్రపు రౌతు వేసుకునే బరువైన బూట్లు రాజు వేసుకుంటాడు; పహ్లావుల (ఇరానియన్లు) వలె ఒంటికి అంటిపట్టుకున్న అంగీ ధరిస్తాడు; శకులవలె మొనతేలిన శిరస్త్రాణం ధరిస్తాడు. విగ్రహాలమీదా నాణాలమీదా చెక్కబడిన వ్రాతలవల్ల వాళ్లు చేసిన ప్రయాణాలు తెలుస్తున్నవి. చక్రవర్తిని మహారాజనీ రాజాధి రాజనీ వ్యవహరించే వారు. ఇరానియన్ల బిరుదు యిది. దీన్ని పహ్లావులు కూడా ఉపయోగించుకున్నారు. దేవపుత్రుడని కూడా రాజుని పిలిచే



వారు. ఇది చీనాలో సుదూర ప్రాంతంలో వాడబడే బిరుదు. ఈ బిరుదులన్నీ సంస్కృత శబ్దాలే. శకులూ కుషానులూ సంస్కృతమును ఆదరించారు. ఇది పండితభాష."

"పవిత్రములైన వేదముల భాష సంస్కృతం. ఇది పండితులకూ, బ్రాహ్మణులకూ మాత్రమే తెలుసు" అన్నాడు తాతయ్య.

మార్ఫి మళ్లీ చెప్పడం మొదలుపెట్టాడు. "కాని యిప్పుడు సంస్కృతాన్ని కవులూ అధికారులూ కూడా వాడుతున్నారు. రాజుల ప్రకటనలూ ఉత్తరువులూ మొదలైనవి సంస్కృతంలోనే ఉంటున్నవి. కనిష్క చక్రవర్తి రెండవ అశోకుడు! బుద్ధుని అనుయాయులలో గొప్పవాడు. ఆయన బౌద్ధ విహారాలు ఏర్పాటు చేశాడు. ఆయన ఆస్థానంలో పండి

తులా కవులూ ఉన్నారు. ఆయన యేలుబడిలోనే మథురలోని శిల్పులు బాగా పైకి వచ్చారు. రాజులూ, ప్రముఖులూ, ధనికులూ, బౌద్ధులూ, జైన తీర్థంకరులూ కోరే శిల్పాలన్నిటినీ ప్రస్తుతం వాళ్లు తయారు చేయ గలరు. చివరికి బ్రాహ్మణులు కూడా తమ దేవతల ప్రతిమలు తయారు చేయించుకుంటున్నారు.''

అప్పుడు తాతయ్య యిలా అన్నాడు: ''మరి, నిర్వాణం పొందిన ఆ మహనీయుణ్ణి మనం శిల్పముల ద్వారా చిత్రించ కూడదంటారుగా! ఆ బుద్ధ దేవుని జీవిత గాథల్ని పవిత్ర సంకేతములద్వారా తెలియజేయాలంటారు.''

''అది మునపటి మాట తాతయ్యా'' అన్నాడు మనవడు. ఇంకా యిలా చెప్పాడు. ''కాని ప్రస్తుతం దక్షిణాపథంలో నివసించే నాగార్జునుడూ, కనిష్కుడూ మొదలైనవాళ్లు బుద్ధుని పూజించేందుకు మనకు ఆయన ప్రతి మలు చాలా అవసరమని నమ్ముతున్నారు. కాగా, మన మథురలోనే కాక, దూర ప్రదేశాలలో సైతం - అంటే తక్షశిల, పురుష పురం, గాంధారం మొదలైన చోట్ల-బుద్ధుని విగ్రహాలు నేను చూశాను. బ్రాహ్మణుడైన అశ్వ ఘోషుడు బౌద్ధమతం స్వీకరించాడు. తర్వాత కనిష్కుడు కూడా బౌద్ధం స్వీకరించాడు. అందువల్ల, నేడు ఎందరెందరో బుద్ధుని అనుయాయులు మనకు కనిపిస్తారు. వీరు రకరకాలుగా బోధించ సాగారు. కనుకనే కనిష్క చక్రవర్తి కాశ్మీర్ లోయలోని కనిష్కపురంలో ఒక మహా సభ ఏర్పాటు చేశాడు. దేశం మొత్తం నుంచి అయిదు వందల మంది భిక్షువులు హాజరయినారు. అశ్వఘోషుడు, వసుమిత్రుడనే ప్రముఖ భిక్షువు అధ్య క్షత వహించారు. చర్చల తరువాత, బుద్ధుని ఉపదేశాలను సమన్వయ పరిచారు. వాటిని రాగి రేకుల మీద చెక్కించారు. ఆ రేకులను ఒక పెద్ద స్తంభం కింద చాలా లోతుగా భూమిలో భద్రం చేశారు. వెయ్యి సంవత్స రాల తర్వాత కూడా వాటిని మానవులు చదవవచ్చునని వాళ్ల ఉద్దేశం.''

''కాని మహాత్ముల ఉపదేశాలను రాగి రేకుల మీద వ్రాయకూడదు కదా!'' అన్నాడు తాతయ్య.

“అయితే ఎలా వాటిని భద్రపరచడం ?” అడిగాడు మార్చి.

“కంఠ పాఠం ద్వారా ఒక తరం వారు మరొక తరం వారికి అందజేస్తారు” అని తాతయ్య జవాబు చెప్పారు.

“అలా అయితే దూర ప్రాంతాల వారికి తెలియజేయడం జరగదు. ఇప్పుడు వ్రాత నాలుగు కాలాల పాటు నిలిచి వుంటుందనీ, వ్రాతలో వుంటే సిద్ధాంతాలను గురించి అభిప్రాయ భేదాలు పోట్లాటలూ రావనీ చాలామంది భావిస్తున్నారు.”

"మునుపు పోట్లాటలుండేవా ?" ప్రశ్నించాడు తాతయ్య.

“లేకేం తాతయ్యా. రెండు ముఖ్య నమ్మకాలున్నాయి. దక్షిణాది భిక్షువేమో బుద్ధుడు నిర్వాణం చెందిన మహాత్ముడనీ, ఆయన ఉపదేశాలను పాటిస్తే జనన మరణాల నుంచి విముక్తి పొందవచ్చుననీ చెపుతారు. కాని ఉత్తరాది భిక్షువువేమో బుద్ధుడు దేవుడనీ, ఆయన్ని మనం పూజించాలనీ చెపుతారు. చక్రవర్తి ఉత్తరాది వాడు కనుక, రెండవ వాదాన్ని (మహాయానం) ఆదరిస్తాడు. అందువల్ల మనం బుద్ధుడు, మరి యితరుల విగ్రహాలు తయారు చేస్తున్నాము” అని జవాబు చెప్పాడు మార్చి.

మార్చి యింకా యిలా అన్నాడు : "కనిష్క చక్రవర్తి తన రాజధానీ నగరం పురుష పురంలో నిర్మించిన విహారం ఆశ్చర్యం గొలుపుతూ వుంటుంది. పధ్నాలుగంతస్తుల ఎత్తయిన గోపురం ఒకటి అందులో ఉంది. దాని పైభాగాన గొప్ప ఇనుప శిఖరం ఉంది. శిఖరం చుట్టూ రాగి గొడుగులు అమర్చబడ్డాయి. పార్శ్వములందు బుద్ధుని ప్రతిమలు చెక్కబడ్డాయి."

“మన మిలా కట్టము” అన్నాడు తండ్రి.

"చక్రవర్తి ఒక్కొక్కసారి యవనుల్ని పనికి నియమిస్తాడు. ఈ విహారానికి అగసిలాస్ అనే యవనుడు పర్యవేక్షకుడు."

"ఇక మనం నిద్రపోయే వేళయింది. నువ్వేం తెచ్చావో, మాకు రేపు సాయంకాలం చూపించాలి” అంది కేతకి.

ఆ మరునాడు సాయంకాలం భోజనానంతరం, మార్చి తాను తీసుకువచ్చిన వస్తువుల్ని చూపించాడు. తల్లికోసం తెల్లని గవ్వ గాజులూ తళతళలాడే లోహంలో చేయబడిన ఒక పెట్టె తీసుకువచ్చాడు. తాతయ్యకోసం చిత్రమైన నమూనా గల వెచ్చని ఉన్నికంబళి తెచ్చాడు. "తాతయ్యా! దీన్ని కాశ్మీరు నుంచి తెచ్చాను. అక్కడి గొర్రెలకు పొడుగాటి బొచ్చు వుంటుంది. దాంతో వెచ్చని ఉన్ని తయారు చేస్తారు" అన్నాడు.

తర్వాత మార్చి ఒక బంగారు నాణెం చూపించాడు. దాన్ని చూసి వాళ్లంతా ఆశ్చర్యంలో మునిగిపోయారు. "దీన్నెలా సంపాదించావు?"



అడిగాడు తండ్రి. "ఇది బంగారం మాత్రం కాదు. మేము సాధారణంగా వాడే రాగి నాణెం యిది. ఒక్కొక్కసారి గవ్వలూ వెండివీ కూడా వాడతాము."

"ఒక వర్తకుని సరకుల్ని దొంగల బారినుంచి కాపాడాను. అప్పు డతను దీన్ని నా కిచ్చాడు. నాన్నా, సరిగ్గా చూడు. నాణెం ఒకవైపున గుర్రపు రౌతు ధరించే దుస్తులతో వున్న రాజు కనిపిస్తాడు. మరో వైపున బుద్ధుని బొమ్మ వుంది. ఆయన పేరు వింత లిపిలో రాసి వుంది."

తండ్రి ఆ నాణాన్ని అటూ యిటూ చూశాడు. "మంచి పనితనం" అని మెచ్చుకున్నాడు.

"దేవతల, రాజుల బొమ్మలతో వున్న యీ బంగారు నాణాలు రోమ్ దేశం నుంచి వస్తాయని విన్నాను. ఆ దేశస్థులు మనతో వర్తకం



చేస్తారు. వాళ్లు మన వద్ద నుంచి సువాసన ద్రవ్యాలు, నగలు, మందు సామాన్లు మొదలైనవీ, చైనావారి నుంచి పట్టు బట్టలూ కొంటారు. ఈ సామాన్లు భూ, సముద్ర మార్గాల ద్వారా వాళ్లకు వెడతాయి. బదులుగా వాళ్లు మంచి బంగారు నాణాలు పంపిస్తారు. వాటిని మన రాజులు కరిగించి, తమ ముద్రలతో మళ్లీ నాణాలు వేస్తారు.''

మార్చి ఒక పెద్ద దంతపు ముక్కను చూపేసరికి, ఆశ్చర్యపడుతూ తండ్రి "ఇంత పెద్ద ముక్క ఎలా సంపాదించావు? సాధారణంగా పనివాడికి యింత పెద్దది దొరకదు" అన్నాడు.

"శిల్పి కనుక సమర్థుడని తెలిస్తే, వర్తకులతనికి దంతమూ, డబ్బూ వెంటనే యిస్తారు. మన దంతపు సామాన్లకు మంచి గిరాకీ వుంది.''

"నాకు మన మధురలో దొరికే రాయి చాలు" అన్నాడు తండ్రి.

"చూడు నాన్నా, నువ్విచ్చిన దాంతో నేనేం చేశానో!''

స్నానం చేసి, తన పొడవైన జుట్టుని ఆరబెట్టుకుంటున్న ఒక యువతి రూపం ఆ రాతిమీద చెక్కబడింది. కిందికి జారుతున్న నీటి బిందువులను మెడ పైకెత్తి అందుకుంటున్న ఒక హంస కూడా చెక్కబడింది. శిల్పి పనితనం నిజంగా మెచ్చుకోతగింది. తండ్రి ఆనందించాడు.
"ఇక నీకు మధురలోనే వుండాలని వుందా?'' అని అడిగాడు.

''నేనిక్కడే వుండాలని నీ అభిప్రాయమా ?''

"అప్పుడే వాడికి భార్యను కూడా నిర్ణయిస్తే !'' అంది తల్లి. "ఆమె యెవరో కాదు. మీతోపాటు పని చేస్తున్న ఆయన కూతురే."

"మన కులం అమ్మాయిని పెళ్లి చేసుకుని, నీలా ప్రతిభ గలవాడు మధురలోనే ఉండడం కంటె నాకింకా కావలసిందేముంది?" అన్నాడు తండ్రి ఆప్యాయంగా.

"అలాగే. నేను చాలా దూరం ప్రయాణం చేశాను. ఇక నేనిక్కడే వుంటాను. ఒక వేళ మళ్లీ ప్రయాణం చెయ్యాలనే కోరిక నాకు కలిగినా, నేను తప్పకుండా తిరిగి వస్తాను.''

# సముద్రగుప్తుని దండయాత్ర

## సముద్రగుప్తుడు – గుర్రపు రౌతు కొడుకు

క్రీ. శ. 347. పాటలీపుత్రంలో మహా సందడిగా ఉంది. సముద్రగుప్త చక్రవర్తి కొత్త దండయాత్రకు సిద్ధమవుతున్నాడు. మౌర్యుల తదనంతరం చాలా శతాబ్దులదాకా తరుచు యుద్ధాలు సాగుతూ వుండేవి. క్రీ.శ. 320 లో చంద్రగుప్తుడు గంగానదీ ప్రాంతంలో తన అధికారం స్థాపించాడు.

తన కుమారుడైన సముద్రగుప్తుని తన వారసుడిగా నియమించాడు. క్రీ.శ. 347 కల్లా, సముద్రగుప్తుడు గంగా తీరాన గల రాజులను జయించాడు; హిమాలయాలు మొదలుకొని నర్మదానది దాకా గల ఉత్తర భారతాన్ని తన వశం చేసుకున్నాడు. ఇప్పుడు నర్మదకు దక్షిణంగా వింధ్య ప్రాంతం మీదికి దండయాత్రకు వెళ్లాలని నిశ్చయించుకున్నాడు. ఆ ప్రాంతమంతా కొండలూ అడవులూను. రాకపోకల సౌకర్యాలుగాని ఉత్తర ప్రత్యుత్తరాలు పంపే వసతులు గాని అంతగా లేవు.

రాజుగారి గుర్రపుశాలలో రక్షస్ అనే గుర్రం ఆ రోజు మొండికెత్తింది. అది సముద్రగుప్తుడి ప్రీతి పాత్రమైన గుర్రం. ఆయన కది ఎంతో విధేయంగా ఉండేది. ఆయన కాక, యింకా యిద్దరి మాట మాత్రమే ఆ గుర్రం వినేది. ఒకడేమో గుర్రపు రౌతు వేణు. అతనే దాన్ని పెంచి పెద్ద చేశాడు. మరొకడు, వేణు కొడుకు. తొమ్మిదేళ్ల బాలుడు. పాకడం నేర్చింది మొదలు గుర్రపుశాలలోనే కాలక్షేపం చేయసాగాడు. పేరు అశ్వదత్తుడు. ఆరోజు వేణుకి జ్వరం వచ్చింది. అందువల్ల మిగిలిన రౌతులు రక్షస్‌ని లొంగ దీసుకోవాలని ప్రయత్నిస్తున్నారు. కాని లాభం లేకపోయింది. వాళ్లను చూడడం తరువాయి, అది తన్నేది.

"ఎక్కడున్నాడు అశ్వదత్తుడు?" అని రౌతులు ఒకరి నొకరు ప్రశ్నించుకున్నారు.



'వాడెక్కడ సైన్యంతో కలిసి వస్తాడేమో అని వాళ్లమ్మ వాణ్ణి గదిలో పెట్టి తాళం వేసి వుంటుంది' అనుకున్నాడు గుర్రపు రౌతుల పెద్ద అయిన సువర్ణ. అతనే వేణు గుడిసెకు బయలుదేరాడు. వాకిట్లో వేణు తల్లీ, భార్యా కనిపించారు.

"అశ్వదత్తు డెక్కడ?"

"రక్షస్‌ని సాగనంపాలని వాడితో చెప్పండి."

వేణు తల్లి యేడుస్తూ "అడవిలోని పులులకు అశ్వదత్తుణ్ణి ఆహారంగా పంపుదామనుకున్నారా?" అని అడిగింది.

"నా కొడుకు నాకెంతో, వేణు కొడుకూ నాకంతే" అని సువర్ణ వెళ్లిపోయాడు గంభీరంగా.

వేణు తల్లీ భార్యా ఒకరి నొకరు చూసుకున్నారు. "రేపు రాజు గారు బయలుదేరుతారు. ఆ తర్వాత అశ్వదత్తుణ్ణి బయటికి పంపుదాం."

ఆ సాయంకాలం రాజుగారికి తెలియజేశారు, రక్షస్‌ని దండ యాత్రకు తీసుకురావడం కష్టమని. అప్పుడు సముద్రగుప్తుడే గుర్రపు శాలకు బయలుదేరాడు. ఆయన్ని చూడడంతోనే, ఆయన వద్దకు పరుగెత్తింది గుర్రం. కాని ఒక రౌతు దాన్ని సమీపించేసరికి, అతన్ని ఒక్క తన్ను తన్నింది రక్షస్. "లాభంలేదు. దీన్ని లొంగదీసుకునే వాడెవ డైనా వుండాలి" అన్నాడు రాజు.

అప్పుడొక కీచు గొంతు వినిపించింది. "నేను దాని సంగతి చూస్తానండి" తర్వాత ఒక పిల్లవాడు వాళ్ల మధ్యకు వచ్చాడు. మురికి ఒళ్ళూ వాడూనూ. ఒంటి మీద సరిఅయిన గుడ్డ కూడా లేదు. అతన్ని చూడ గానే, రక్షస్ అతని వద్దకు పరుగెత్తింది. అతను దాన్ని బుజ్జగించాడు.

"ఎవరు నువ్వు?" అడిగాడు చక్రవర్తి.

"వాడు వేణు కొడుకు, ప్రభూ!" అన్నాడు సువర్ణ.

"మా నాయనమ్మ నన్ను గదిలో పెట్టి తాళం వేసింది. కాని మహారాజుగారికి నా అవసరం కలిగినప్పుడు, ఆయనతో పాటు వెళ్లే హక్కు నాకుంది. అందుకని గదికి కన్నం చేసి, దానిగుండా బయట పడ్డాను" అన్నాడు అశ్వదత్తుడు.

"అవును నాయనా, నీ అవసరం మాకు కలిగింది" అన్నాడు చక్రవర్తి, నవ్వుతూ. "కాని మీ అమ్మా మీ నాయనమ్మా అందుకు ఒప్పుకోవాలి. వెంటనే అడుగుదాం, పదండి."

సువర్ణ వాళ్లిద్దరిని తీసుకువచ్చాడు. "తన మహారాజుతో పాటు వెళ్లనీయకుండా, ఎందుకు మీరీ అబ్బాయిని ఆపారు?" అని అడిగాడు సముద్రగుప్తుడు.

అశ్వదత్తుని నాయనమ్మ ధైర్యంగా ఇలా అంది. "మహారాజా! వాడు తొమ్మిదేళ్ల పిల్లవాడు. వాడు మీతో పాటు వెళ్లాలనుకున్నాడు. మీరు పూజ్యురాలయిన మీ అమ్మగారిని గౌరవిస్తున్నట్టు, ఈ కుర్రవాడు కూడా వాళ్ల నాయనమ్మ మాట వినవద్దా, మీరే చెప్పండి."

సముద్రగుప్తుడికి తల్లి అంటే మహా గౌరవం. ప్రాచీనమూ శక్తిమంతమూ అయిన లిచ్ఛవీ వంశానికి చెందిన ఆమెను తన తండ్రి పెళ్లి చేసుకోవడం వల్ల, మగధ మీద చంద్రగుప్తుడికి హక్కు కలిగింది. "మీ అబ్బాయిని తీసుకువెళ్లేందుకు నాకు అనుజ్ఞ యివ్వండి. వాణ్ణి జాగ్రత్తగా చూసుకునే భారం సువర్ణది" అన్నాడు రాజు.

"అయితే వాణ్ణి క్షేమంగా యింటికి తీసుకువస్తానని మాట యిస్తారా?" అడిగింది ఆమె.

"నా కన్నకొడుకుని చూసుకున్నట్టుగా, నేను మీవాణ్ణి చూసుకుంటాను" అన్నాడు సువర్ణ.

వెంటనే, అశ్వదత్తుణ్ణి ప్రయాణానికి సిద్ధం చేశారు. ఆ సందట్లో అతను వెళ్లివస్తానని చెప్పడం కూడా మరిచిపోయాడు.

## దండయాత్ర

ఆ విధంగా అశ్వదత్తుడు సముద్రగుప్తుని మధ్య, దక్షిణ ఇండియాల దండయాత్రలలో పాల్గొన్నాడు. అతన్ని జాగ్రత్తగా చూసుకుంటానన్న తన మాటను కాపాడుకున్నాడు సువర్ణ. రాజుగారికోసరం తయారుచేసే భోజన పదార్థములలోంచి అతనికి భోజనం పెట్టారు. నర్మదకు దక్షిణంగా ఉన్న ప్రాంతం కీకారణ్యాల మయం. నేల మరీ గట్టిగా ఉంది. ఇప్పుడు సైనికులకు బజ్రా ధాన్యం, అడవి పళ్లు, కుందేళ్లు, కౌజు పిట్టలు, కోలంకి పిట్టలు మొదలైనవి ఆహారంగా లభించేవి.

ప్రాతఃకాలపు ప్రార్థనను నిర్వర్తించే నిమిత్తం చక్రవర్తి తెల్లవారుజామునే లేచి ఒంటరిగా వెళ్లేవాడు. ప్రార్థన చేసేటప్పుడు తన ఆయుధాలను తీసి పక్కగా పెట్టేవాడు. అశ్వదత్తుడు కూడా చింత కాయలు, మామిడికాయలు మొదలైన వాటికోసం బయలుదేరేవాడు.

ఒకరోజు పొద్దున చక్రవర్తి తూర్పుగా తిరిగి సుంచుని వుండగా, ఒక దారుణ మృగం ఆయన కంట బడింది. వెంటనే ఆయన చేతిలోకి విల్లూ బాణమూ వచ్చిపడ్డాయి. అందుకు కారణం అశ్వదత్తుడు. అప్పుడతను ఒక మామిడిచెట్టు మీద కూర్చున్నాడు. అతను పులిని చూశాడు.

మహారాజుగారి బాణం పులి మెడలో గుచ్చుకుంది. ఆ దెబ్బకు ఆ క్రూరమృగం విలవిలా తన్నుకుంది. బాగా గాయపడింది. అంతకు ముందే అశ్వదత్తుడు ఒక వేట కత్తిని తన బలం కొద్దీ దాని మీదికి విసిరి వేశాడు. పులి కాస్తా కిందికి ఒరిగిపోయింది.

"మాంచి దెబ్బ" అన్నాడు రాజుగారు. అప్పుడే అందరూ అక్కడికి గుమిగూడారు. రాజుగారిని మెచ్చుకున్నారు. కాని ఆయన "ఈ గౌరవం యీ చిన్నకుర్రాడికి దక్కాలి" అన్నాడు.

అశ్వదత్తుడు కిందికి దిగివచ్చాడు. సువర్ణ ముఖం నల్లబడిపోయింది. "అడవిలోకి ఒంటరిగా వెళ్లవద్దని ఎన్నిసార్లు చెప్పాను నీకు ?" అన్నాడు.



"కాని నేనక్కడ వుండడం, మహారాజుగారికి సహాయం చేయ డం మంచిదయింది కదా!" అన్నాడు అశ్వదత్తుడు. వెంటనే సువర్ణ వద్దకు వెళ్లి, "యికమీద నీ మాట తప్పకుండా వింటాను" అన్నాడు. ఇలా ఎన్ని సార్లు అన్నాడో!

ఆ తర్వాత, వాళ్లు మరీ కీకారణ్యంలోకి వెళ్లారు. అడవి మనుషుల యుద్ధ విధానం వేరు! పగలు గాని, రాత్రి గాని చెట్ల కొమ్మల్లోంచి లేకపోతే పొదల్లోంచి విషపూరితమైన బాణం ఒకటి వచ్చి పడేది. పులులూ చిరుత పులులూ పాములూ తిరుగుతూ వుండేవి.

అయినప్పటికీ, సముద్ర గుప్తుని సైన్యాలు ముందుకి

చొచ్చుకు వెళ్లాయి. వింధ్య ప్రాంతంలోని రాజులేకాక మహానది, గోదావరి, కృష్ణా తీరాలలోని రాజులు కూడా లొంగిపోయారు.

వ్యాఘ్రరాజు (పులుల రాజు) రాజ్యంలో సువర్ణ, పావం చని పోయాడు. ఎక్కడో ఒక పొద నుంచి వచ్చిన విషపూరితమైన బాణం వల్ల, అతను కన్ను మూశాడు.

అశ్వదత్తుడికి అన్నం సహించలేదు. పీడ కలల వల్ల సరిగా నిద్ర పోలేదు. బాగా చిక్కి పోయాడు. ముఖం పాలిపోయింది. ఇది పసిగట్టిన మహారాజు "నువ్విలా దిగులు పడకూడదు. నువ్వు కనుక మూల పడితే, రక్షస్‌ని ఎవరు చూస్తారు? ఇక నుంచీ నువ్వు నా గదిలోనే పడుకో" అన్నాడు.

ఆ రాత్రి గాని తర్వాత గాని అశ్వదత్తుడికి పీడ కలలు రాలేదు. కొమ్మలూ వెదుళ్ళూ మొదలైనవాటితో కట్టిన రాజుగారి 'సంచార భవనం' వాకిట్లో అతను నిద్రపోయేవాడు. అతనికి మధురమైన సంగీతం వినిపించేది. అది రాజుగారి విశాలమైన గది నుంచి విన వస్తున్నట్టు గ్రహించాడు. వెంటనే అతను గది వద్దకు వెళ్లి వినసాగాడు. ఉన్నట్టుండి ఒక బల్లెం అతని ఒంటికి తగిలింది. "ఎలుక, ఎలుక! అది ఎలా వచ్చిందిక్కడికి?" అని బొంగురు గొంతు వినిపించింది.

అశ్వదత్తుడు భయపడిపోయాడు. కాని ధైర్యం తెచ్చుకుని యిలా



జవాబు చెప్పాడు. "నేను అశ్వ దత్తుణ్ణి. రాజుగారి గుర్రపు రౌతుని. తీయని సంగీతాన్ని విం టున్నాను."

"రాజుగారి సంగీతాన్ని విన డానికి నీకెన్ని గుండెలురా! అలా చేసిన వాళ్లకు చావు తప్పదు" అని ఆ బొంగురు గొంతు భయ పెట్టింది.

"మన మహారాజుగారు గాయక చక్రవర్తి. కనుక అయన సంగీతాన్ని వినడానికి యీ కుర్రవాడు తపించిపోవడంలో వింతలేదు'' అని యింకో కంఠం వినిపించింది. ఆ కంఠాన్ని అశ్వ దత్తుడు గుర్తించాడు. అది రాజు గారి అప్తుడూ, ఆస్థాన విద్వాం సుడూ, వీరుడూ అయిన హరిసేన పండితుడిది. రాజుగారి కోరిక ప్రకారం పండిత హరిసేనుడు లోపలికి వెళ్ళాడు. జరిగిన విష యాన్ని వివరించి, ఆయన అశ్వ దత్తుణ్ణి లోపలికి తీసుకు వెళ్ళాడు.

మహారాజు పరుపు పరిచిన ఉన్నతాసనం మీద కూర్చు న్నాడు. వదులుగా ఉన్న నూలు



దుస్తులు ధరించాడు. చేతిలో వీణ ఉంది. నవ్వి, యిలా అన్నాడు : "నా గదిని ఆనుకుని అశ్వదత్తుడికి మంచం వేయించండి. ఈ వీణా నాదం వింటూ అతన్ని హాయిగా నిద్ర పోనివ్వండి."

అందువల్ల మహారాజుగారి అభిరుచులను గురించీ, ఆయన పాండిత్యం గురించీ తెలుసుకునేందుకు అశ్వదత్తుడికి మంచి అవకాశం కలిగింది. మహారాజు వీరుడు, కవి, గాయకుడు, పండితుడూను.

ఆ తర్వాత వాళ్లు నాగరికతకు నిలయమైన పట్టణాల మీదుగా ముందుకి, అనగా దక్షిణానికి వెళ్ళారు. మొట్టమొదటి సారిగా, అశ్వదత్తుడు సముద్రం చూశాడు.

రథసేనతో పాటు మరొక గుర్రం కూడా వాళ్లతో పాటు వచ్చింది. అది యజ్ఞం చేసేటప్పుడు ఉపయోగించే అశ్వం. దానిమీద ఎవ్వరూ కూర్చోలేదు. అది యే రాజ్యం గుండా వెళుతుందో, ఆ రాజ్యాధిపతి సముద్రగుప్తుని అధికారమును అంగీకరించడమే కాక ఆయన్ని చక్రవర్తిగా కూడా గుర్తించినట్టు అర్థం. వాళ్లు పాటలీపుత్రం తిరిగి చేరుకున్నాక, ఆ గుర్రాన్ని బలి యిస్తారు. అశ్వదత్తుడు దాంతో స్నేహం కట్టాడు. దానికి నచ్చిన ఆహారం పెట్టేవాడు.

కృష్ణా గోదావరి నదుల మధ్య ఉన్న వేంగి రాజ్యం మీదుగా వాళ్లు వెళ్ళారు. ప్రాచీన నగరమూ, విద్యాపీఠమూ అయిన కంచిలో గొప్ప దర్బారు జరిగింది. ఆ సందర్భంలో దక్షిణాపథంలోని రాజులు చక్రవర్తికి కప్పములు చెల్లించారు. లంకను పరిపాలించే మేఘవర్ణుడు దూతల ద్వారా ఒక నగల పెట్టెను సమర్పించాడు.

## తిరుగు ప్రయాణం

చిట్టచివరికి, సముద్రగుప్తుని సైన్యం పడమటి దక్కను (అంటే, మహారాష్ట్ర) మీదుగా స్వదేశం చేరుకుంది. సైనికులు మూడేళ్లపాటు స్వదేశంలో లేరు. యుద్ధరంగంలో గాని వేటలోగాని యుద్ధ చర్చల్లో గాని మహారాజు మొదటి వరుసలోనే ఉండేవాడు. రాత్రి వేళల్లో మత విషయక చర్చలు జరిగేవి; కవి సమ్మేళనాలూ సంగీత సభలూ సాగేవి. దర్బారులలో ఆయన సామంతుల వద్ద కప్పములూ కానుకలూ స్వీకరించేవాడు.

స్వదేశం చేరుకున్న అశ్వదత్తుడు మునుపటి అశ్వదత్తుడు కాడు. ఇప్పుడు పొడుగ్గా, దృఢంగా ఉన్నాడు. చిలిపితనం లేదు. మహా సాహసిగా కనిపించాడు.

అశ్వమేధయాగాన్ని సందర్శించ వచ్చిన బ్రాహ్మణులు మొదలైన వారితో పాటలీపుత్రం కిటకిటలాడుతోంది. పురాణకాలంలో యుధిష్ఠిరుడు (మహా భారత కథలోని ధర్మరాజు) అశ్వమేధం చేశాడు.

దండయాత్ర సాగినన్నాళ్ళూ ఆ యాగశ్వమంటే అశ్వదత్తుడికి చాలా అభిమానం! చివరి రాత్రంతా దాంతోనే గడిపాడు. దానికి వీడ్కోలు చెప్పాడు. ఆ మరనాడు పూలదండలతో చక్కగా అలంకరించి దాన్ని బలి యిచ్చారు. ఆ సందర్భంగా బంగారు నాణాలు ముద్రించి, వాటిని బ్రాహ్మణులకు యిచ్చారు. అశ్వదత్తుడికి కూడా ఒక నాణెం యిచ్చారు. దాన్ని అతను ఇంటికి తీసుకు వెళ్ళాడు, తలిదండ్రులకు చూపించాలని. అంతకుముందే అతను మరికొన్నిటిని కూడా సేకరించి ఒక చిన్న మూటగా కట్టాడు.

ఆ రాత్రి అశ్వదత్తుడూ అతని తలిదండ్రులు వాటిని చూశారు. "ఇంతకు ముందు పరిపాలించిన రాజులు ఇంత చక్కని నాణాలు వెయ్య లేదు. వీటిని దీనారము లంటారు. ఈ కొత్త దీనారం చూడండి. ఒక

వైపు నిన్న బలి యివ్వబడిన గుఱ్ఱపు బొమ్మ ఉంది'' అని అతను వివరించాడు.

ఆ నాణెం మరోవైపు చూస్తూ అశ్వదత్తుని తల్లి, "చూడు, ఈ వైపు ఎవరిదో ఒక స్త్రీ బొమ్మ వుంది'' అంది.

"అది మన మహారాణి దత్తాదేవిగారి బొమ్మ. బొమ్మ కింద 'అశ్వమేధ యాగం' అని వ్రాయబడింది. చూశావా అమ్మా, మన మహారాజుగారు రాణిగారిని ఎంతగా గౌరవిస్తున్నారో'' అన్నాడు అశ్వదత్తుడు.

ఇంకొక నాణెం చూపిస్తూ అతనిలా అన్నాడు. "ఇందులో మహారాజుగారి బొమ్మ చెక్కబడింది. చేతిలో వీణ. ధోవతి కట్టుకున్నారు. కాని ముత్యాలు పొదిగిన శిరో భూషణం దాల్చారు. చెవులకు వజ్రాలు. చేతికి ఎంతో విలువైన ఆభరణం. నాణెం మరోవైపున లక్ష్మీదేవి బొమ్మ ఉంది.

ఒకరోజు లంకను పరిపాలించే మేఘవర్ణుని దూతలు పాటలీపుత్రానికి వచ్చారు. వారు బౌద్ధులు. చక్రవర్తికి విలువగల కానుకలు తెచ్చారు. అశోక చక్రవర్తి బుద్ధగయలో నిర్మించిన విహారాన్ని చూడ వచ్చిన లంకలోని బౌద్ధులు తమకు ఉండడానికి తగిన వసతులు లేవని మేఘవర్ణునికి తెలియజేశారు. అందువల్ల బౌద్ధులు పుణ్యక్షేత్రాలను సందర్శించ వచ్చే బౌద్ధుల ఉపయోగం కోసం ఒక విహారం నిర్మించడానికి గాను ఆయన సముద్రగుప్తుని అనుమతిని కోరాడు. అనుమతి యివ్వబడింది; ఒక మంచి చోటు ఎన్నిక చేశారు. విహారం కూడ కట్టబడింది. అది మూడంతస్తులది. అందులో ఆరు మండపాలు. దాని చుట్టూ 30-40 అడుగుల ఎత్తుగల బలిష్ఠమైన ఒక ప్రహరీ గోడ. లోపల, వెండి బంగారాలతో చేయబడి మణులు పొదిగిన బుద్ధదేవుని విగ్రహం.

సముద్రగుప్తుడూ ఆయన కుమారుడూ విష్ణుమూర్తిని కొలిచే వారయినా, మహారాజు బౌద్ధ మతాన్ని యింతగా ఆదరించిన విషయం వినేసరికి అశ్వదత్తుని తల్లికి ఎంతో ఆశ్చర్యం కలిగింది. అప్పుడు గుప్తుల

ఆస్థానంలో బౌద్ధ విద్వాంసుడైన వసుబంధు పండితుడికి గల ప్రముఖ స్థానం గురించి అశ్వదత్తుడు తల్లిదండ్రులకు తెలియజేశాడు.

"మన మహారాజుగారి ఆప్తుడు బ్రాహ్మణుడైన హరిసేన పండితుడు గదా!" అన్నాడు తండ్రి.

"హరిసేనుడు సంస్కృతంలో గొప్ప పండితుడూ కవీను. కాని ఆయన పేరు పాటలీపుత్రం వారికే తెలుసు. మరి, వసుబంధుని పేరు దేశ దేశాలవారికీ తెలుసు. పురుషపురం, లంక, చైనా మొదలైన దేశాలనుంచి ఆయనకు ఆహ్వానాలు వచ్చాయి. మన చక్రవర్తులందరు మతాచార్యుల్ని గౌరవించారు; వాళ్ల అనుయాయులకు వసతులు కల్పించారు."

ఇప్పుడు మహారాజుగారికి అశ్వదత్తుడంటే అంతులేని అభిమానం.



ఆయనతోపాటు అతనూ ఎన్నో ప్రయాణాలు చేశాడు. తన తండ్రి జీవిత కాలంలో అతను చేసిన చివరి ప్రయాణం ప్రయాగకి.

సముద్రగుప్తుడు వృద్ధుడయాడు. ఆయన్ని గురించి హరిసేన పండితుడు సంస్కృతంలో ఒక కావ్యం వ్రాశాడు. కౌశాంబిలో సుమారు అయిదు శతాబ్దులుగా ఉంటున్న ఒక చక్కని స్తంభం మీద ఆ కావ్యం చెక్కబడింది.

యుద్ధ వీరునిగా, గాయకునిగా, కవిగా మహారాజు ఆ కావ్యంలో చిత్రింపబడిన తీరుని అశ్వదత్తుడు తలిదండ్రులకు సంగ్రహంగా వివరించాడు. ఆ మహారాజు చేసిన తూర్పు, ఉత్తర, దక్షిణ దండ యాత్రల విశేషాలను కూడా వివరించాడు.

"మేమందరం కంట తడిపెట్టగా, నువ్వానాడు మొట్టమొదటి సారిగా మహారాజుగారితో బయలుదేరావు. ఆనాటినుంచీ ఈనాటి దాకా ఎన్నెన్ని విషయాలు తెలుసుకున్నావు! దీనికంతా కారణం ఆ రక్షస్ గుర్రం. నువ్వు లేకుండా అది బయలుదేరింపి కాదు" అంది అశ్వదత్తుని తల్లి.

# హర్ష చక్రవర్తి

## యువకుడైన హర్షుడు కనోజికి రాజగుట

వింధ్యాటవిలో ఒక చోట శోకం మూర్తీభవించిన ముగ్గురు పొడుగాటి స్త్రీలు ఒక చితిముందు కూర్చున్నారు. పొట్టిగా, నల్లగా ఉండే అడవి స్త్రీలకంటె వాళ్ళు భిన్నంగా కనిపించారు. ఆ ముగ్గురిలో మరీ చిన్న దాని ముఖంలో రాజకళ కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది. ఆమె యువరాణి రాజ్యశ్రీ. ఆమె తండ్రి స్థానేశ్వరం పరిపాలించే రాజు. రాజ్యం చిన్న దైనా, దాన్ని ఒక ముఖ్యమైన రాజ్యంగా చేశాడు ఆయన. హూణుల్ని తరిమివేశాడు. స్కందగుప్తుని కాలం నుంచీ వాళ్ళు దేశంమీద పడి కొల్ల గొట్టేవారు.

రాజుకి రాజ్యవర్ధనుడూ హర్షుడూ అనే యిద్దరు కుమారులు. చక్కని చుక్కయైన రాజ్యశ్రీని కనోజి రాజుకిచ్చి పెళ్లి చేశాడు. అప్పుడే ఆర్యావర్తంలోని నగరాలలో ప్రముఖ నగరంగా కనోజి రూపు దిద్దు కుంటోంది.

ఇంతలో ఉన్నట్టుండి హూణులు దండెత్తి వచ్చారనే వార్త ఒకటి ఉత్తర దిశనుంచి వచ్చింది. వెంటనే రాజ్యవర్ధనుని నాయకత్వంలో సైన్యం బయలుదేరింది. వాళ్లతోపాటు హర్షుడు కూడా బయలుదేరాడు. అప్పుడతనికి పదిహేనేళ్ళు! అందువల్ల అతన్ని హిమాలయాల మొదట్లోనే ఉండమని చెప్పి, రాజ్యవర్ధనుడు ముందుకి వెళ్ళాడు. హర్షునికి తోడుగా కొంత అశ్వికదళం ఉంచడం జరిగింది. అది సుందరమైన ప్రాంతం. అక్కడ హర్షుడు ఆటపాటల్లో మునిగిపోయాడు.

ఇంతలో రాజుగారు మరణ శయ్యమీద ఉన్నట్లు వార్త వచ్చింది. వెంటనే హర్షుడు తండ్రి వద్దకు బయలుదేరాడు. ఈ వార్తను తెలియజేయ డానికి కొందరు సైనికులు ఒంటెలమీద బయలుదేరారు, రాజ్యవర్ధనుని

వద్దకు. పోతూ పోతూ హూణులు రాజ్యవర్ధనుని గాయపరచి మరీ వెళ్ళారు. కష్టాల మీద కష్టాలు వచ్చిపడ్డాయి. ఈ పరిస్థితిని అండగా తీసుకుని పడమటి మాళ్వ పరిపాలకుడు కనోజిని ముట్టడించాడు. రాజుని చంపివేశాడు. రాజ్యశ్రీని ఖైదులో ఉంచాడు.

రాజ్యవర్ధనుడు వెంటనే ప్రయాణమై వెళ్లి, మాళ్వరాజుని జయించాడు. ఈ విషయం తెలియని రాజ్యశ్రీ గుప్త వంశీయుడైన ఒక ప్రముఖుని సహాయంతో తప్పించుకుని, ఒక బౌద్ధ భిక్షువు సహకారంతో వింధ్యాటవిలోని ఒక బౌద్ధాశ్రమం చేరుకుంది.

కష్టాలింకా రాజ్యవర్ధనుని వెంటాడసాగాయి. అతన్ని ఒక సమావేశానికి రమ్మని స్నేహం నటించి గౌడ రాజు (పశ్చిమ బెంగాలు) శశాంకుడు పిలిచాడు. అతను మాళ్వరాజుకి మిత్రుడు. ఒక్క సైనికుణ్ణి కూడ వెంట తీసుకువెళ్లలేదు రాజ్యవర్ధనుడు. పాపం, అతన్ని హత్యచేశారు.

అందువల్ల భారమంతా హర్షునిమీద పడింది. తన అన్నయ్యను చంపినవారి మీద పగ తీర్చుకోవాలనీ, సోదరిని కాపాడాలనీ నిశ్చయించుకున్నాడు.

ఇలా ఉండగా, రాజ్యశ్రీ నిస్పృహ చెందింది. క్రుంగి కృశించిపోయిన ఆమె మరణించాలనే ఉద్దేశంతో చితికి కావలసిన ఏర్పాట్లు చేసింది. "తండ్రీ, అన్నయ్యా, భర్తా మరణించారు. ఇంక నన్నెవరు కాపాడుతారు? నే నెందుకు బ్రతకాలి?" అంది వెంటనున్న స్త్రీలలో



"ఇంకా మీ సోదరుడు వున్నాడు గదా! అతన్ని మన వద్దకు పంపిస్తామని అడవి దొరలు చెప్పారు."

"అతనేమో చిన్నవాడు; బాధ్యత లేమో ఎక్కువ."

కొన్ని రోజులు గడిచాయి. ఎవ్వరూ యే సహాయమూ చెయ్యలేదు. చివరికి రాజ్యశ్రీ ఇలా అన్నది: "రేపు తప్పక మరణిస్తాను. ఇవాళ రాత్రి ప్రార్థన చేద్దాము. అగ్ని నన్ను పరిశుద్ధనుగా చేయడమే కాక నా కష్టాలను తొలగిస్తుంది."

కాని తెల్లవారేసరికి అదృష్టదేవత రాజ్యశ్రీని వరించింది. పగలూ రాత్రీ అనక ప్రయాణం చేసిన హర్షుడు సకాలంలో తన సోదరిని సమీపించాడు. రాజ్యశ్రీ, సఖురాండ్రు కూడా మరణించాలనే నిశ్చయించుకున్నారు. కాగా, వాళ్ళు ముగ్గురూ చితి నెక్కడానికి ప్రయత్నిస్తూ వుండగా, హర్షుడు రాజ్యశ్రీని కాపాడాడు.

"హర్షా! నువ్వు వచ్చావా?" అంది ఆమె. "కాని అన్ని వైపుల నుంచి బెదిరిస్తున్న ఆపదలను మన మేం చెయ్యగలం? నువ్వేమో రాజుగా ఉండదలుచుకోలేదు; కవిగా వుండాలనుకున్నావు గాని."

హర్షుడు నమ్మకం కలిగించే విధంగా అన్నాడు. "మొట్టమొదట మన తాతయ్య కొలుస్తూ వచ్చిన యీ సూర్యుణ్ణి నమస్కరిద్దాము. సూర్యుడు మనకు కొత్త జీవితమూ కొత్త రోజూ ప్రసాదిస్తున్నాడు." తన వెంటనున్న పండితుని వైపు చూశాడు. ఆయన సూర్యుణ్ణి స్తుతించాడు.

ఆ తర్వాత వాళ్ళు తిరిగి వచ్చారు. మంత్రులూ మొదలైన వారి సమ్మతితో హర్షుడు కనోజి, స్థానేశ్వరములకు రాజయాడు. హర్షుడు చిన్నవాడవడం వల్ల, కొందరతనిని సందేహించారు. కాని వృద్ధ సేనాపతి సింహనందుడు హర్షుడు రాజు కావాలని పట్టుబట్టాడు. ఆ విధంగా క్రీ. శ. 606 లో హర్ష శకం మొదలయింది.

## కనోజికి మంచి రోజులు

ముప్ఫయి అయిదేళ్ల తర్వాత హర్షుడూ, రాజ్యశ్రీ, ప్రభాకర పండితుడూ ఉచ్ఛస్థితిలో ఉన్నారు. మంచి రక్షణ గల కనోజిలో వారి నివాసం. కనోజికి పడమట గంగానది. మిగిలినవైపుల లోతైన అగడ్తలూ, మధ్య మధ్య ఉన్నత స్తంభాలూను. కనోజిలో అందమైన ఆలయాలూ, బౌద్ధ విహారాలూ, రాతితోనూ కర్రతోనూ కట్టబడిన యిళ్ళు వాకిళ్ళు వెలిశాయి.

హర్షు డిప్పుడు ఆర్యావర్తమునకు ప్రభువైనాడు. రాజ్యశ్రీ అతని పక్కనే కూర్చుని పండితుల ప్రసంగాలు వినేది; చర్చల్లో పాల్గొనేది. హర్షుడికి మత విషయములన్నా భోగములన్నా చాలా అభిమానం. అందువల్ల రకరకాల సమావేశాలు ఏర్పాటు చేయడంలో మునిగి తేలుతూ వుండేవాడు పండితుడు.

హర్షుడు రచించిన నాగానంద నాటకాన్ని పండితుడు రంగస్థల మెక్కించాడు. అది ఒక ప్రాచీన బౌద్ధ గాథ ననుసరించి వ్రాయబడిన నాటకం. నాటకం ముగిసిన తర్వాత పండితుని కొడుకు పుండరీకుడు తన స్నేహితులైన వసుభూతి, అయంలతో చర్చించాడు. "అశోకుడు, సముద్రగుప్తుడు, చంద్రగుప్త విక్రమాదిత్యుడు మొదలైన వారిలా మన మహారాజు కూడా గొప్పవాడు. మా నాన్నగారు మహారాజును గురించి చెపుతూ యిలా అంటారు: "ఆయన శాంతి కాముకుడు, దయామయుడు. ఇతరులలోని మంచినే ఆయన చూస్తారు. ప్రజల క్షేమం కోసం ఆయన స్వార్థత్యాగం చేసుకుంటారు. సరిగ్గా యిదే విధంగా మహారాజు నాటకంలోని నాయకుడైన జీమూతవాహనుని చిత్రించారు."

"సరేగాని, మన మహారాజు అశోకునివలె గొప్ప వాడంటావు. అశోకుడు శాంతికోసం యుద్ధమును త్యజించాడు. సముద్రగుప్తుడు ఉత్తర, దక్షిణాపథాలను జయించాడు" అన్నాడు అయం.

వసుభూతి అన్నాడు గదా: "ఒకప్పుడు రాజుగారి సైన్యంలో 5,000 ఏనుగులుండేవి. 20,000 మంది ఆశ్వికులూ 50,000 సైనికులూ వుండేవారు. ఇప్పుడు 60,000 ఏనుగులున్నాయి ; 100,000 మంది ఆశ్వికులున్నారు."

"దేశంలో శాంతిని స్థాపించేందుకు హర్షుడు పోరాడవలసి వచ్చింది. హూణులు గుప్త సామ్రాజ్యాన్ని పడగొట్టిన తర్వాత, ఆర్యావర్తంలో బలవంతుడైన రాజు లేకపోయాడు" అన్నాడు పుండరీకుడు.



"ఆరేళ్లదాకా సైనికులు తమ ఆయుధాలు కింద పెట్టలేకపోయారు. ఎలాగయితేనేం చివరికి రాజ్యాలన్నీ ఒక్క గొడుగు కిందికి రాగలిగాయి. హర్షుడిప్పుడు నేపాలుతో సహా గంగానది లోయనంతా తన వశం చేసుకున్నాడు. ఆయన రాజ్యం హిమాలయాలు మొదలుకొని నర్మద దాకా విస్తరించిందన్న మాట. ఎక్కడెక్కడి రాజులూ - తూర్పున వున్న కామరూపం (అస్సాము) ప్రభువు మొదలుకొని పడమట వల్లభి రాజు దాకా, అందరూ – హర్షుని అధికారానికి లోబడిన వారే.



వీళ్ల మాటల్ని ప్రభాకర పండితుడు విన్నాడు. "నిజమే. కాని ప్రజాక్షేమం కోసం హర్షుడు తన శక్తినంతా వినియోగిస్తున్నాడు. బాటసారుల కోసం విశ్రాంతి గృహాలూ, మనుషులకూ, జంతువులకూ వైద్యశాలలూ కట్టించాడు. దొంగలను పట్టుకునేందుకు మనుషుల్ని నియమించాడు. కోతల సమయంలో గ్రామస్థులకు ప్రత్యేక రక్షణ కల్పించాడు. పట్టణాలలోనూ గ్రామాలలోనూ రహదారుల మీద భద్రత నెలకొనే విషయమై తరుచుగా ప్రయాణం చేస్తారు."

"మహారాజు గారి దినచర్య యేమిటండీ?" అని అడిగాడు వసుభూతి.

"రోజులో కొంత భాగం రాజ్య వ్యవహారాలకు వినియోగిస్తారు. రాజ్యం ప్రతి భాగం నుంచీ వచ్చే సమాచారాలను మంత్రి మండలితో సంప్రతించి వ్రాత పూర్వకంగా ఉత్తరువులు పంపిస్తారు. వాటిని వెను వెంటనే ఒంటెల మీద అందజేస్తారు. ఇందుకోసం ఒక శాఖనే ఏర్పాటు చేశారు.

"కనోజిలో సాగినట్లుగానే, చెట్ల కొమ్మలతోనూ వెదుళ్లతోనూ నిర్మించిన 'సంచార భవనం'లో కూడా ఆయన దినచర్య సాగుతుంది. ఇలా చేయకపోతే, ఆయనకు గల వివిధ కార్య కలాపాలను నిర్వర్తించ లేడు."

ఇంకా పండితుడిలా అన్నాడు "ధర్మ కార్యాలకు గాను రోజులో కొంత భాగం వినియోగించబడుతుంది. పేదవారికీ, మతాచార్యులకూ, విద్యా సంస్థలకూ రాజుగారు దానాలు చేస్తారు; ఇవి చక్కగా జరగాలి; వీటిని పర్యవేక్షించాలి. బౌద్ధ భిక్షువులకూ, బ్రాహ్మణ సన్న్యాసులకూ రోజూ అన్నదానం జరుగుతుంది."

అయం అడిగాడు: "బౌద్ధ ధర్మాలంటే రాజుగారికి అంత అభిమానం ఎందుకు? ఆయన పూర్వులు బౌద్ధులు కారు గదా!"

"మన రాజుగారి పూర్వులు ఎందరో దేవతల్ని పూజించారు. ఆయన దూరపు పూర్వీకుడు ఒకాయన శివుణ్ణి ఎక్కువగా అభిమానిం

చాడు; పూజించాడు. రాజుగారి తండ్రి ప్రభాకరవర్ధనుడు ప్రతి రోజూ ఆదిత్యుని ప్రార్థించేవారు; కెంపులు పొదిగిన పాత్రలో కెందామరలు సమర్పించేవారు. హర్షుడు శివునికీ, సూర్యునికీ, బుద్ధునికీ ఆలయాలు కట్టించారు. నలందాలోని బౌద్ధ విశ్వవిద్యాలయానికి పోషకులు. ప్రతి అయిదేళ్లకొకసారి ఒక గొప్ప పరిషత్తుని ఏర్పాటు చేస్తారు. దేశదేశాల నుంచి వచ్చిన పండితులు అందులో పాల్గొని చర్చలు జరుపుతారు. ఒకరి భావాలు మరొకరు తెలుసుకుంటారు" అన్నాడు పండితుడు.

"ఈ పరిషత్తులలో సత్కారం జరుగుతుందనుకుంటాను'' అన్నాడు వసుభూతి.

"ఆ క్రితం అయిదేళ్లలో రాజుగారి సొంత ఖజానాలో చేరే డబ్బునంతా బౌద్ధ భిక్షువులకూ బ్రాహ్మణ పండితులకూ పేదవారికీ ఇస్తారు. చివరికి తన ఆభరణాలను వస్త్రాలను కూడా ఇచ్చివేస్తారు. చెల్లెలి వద్దనుంచి వస్త్రాలు అడిగి తీసుకుంటారు. ఆ విధంగా వచ్చిన డబ్బుని భిక్షువులు తమ పవిత్ర గ్రంథాలకు ప్రతులు తయారుచేయడానికి వినియోగిస్తారు'' అని పండితుడు చెప్పాడు.

"రాజుగారి యితర కార్యకలాపాలు యింకా యేమన్నా వున్నాయా?" అడిగాడు వసుభూతి.

"రోజులో కొంత భాగం సాహిత్య చర్చలకు వినియోగించబడుతుంది. కవులకు పోటీలు పెడతారు. కవులు కావ్య గానం చేస్తారు. హర్ష చక్రవర్తి నాటకాలూ, ఒక వ్యాకరణ గ్రంథమూ వ్రాశారు. ఆయన ఆప్తమిత్రుడైన బాణభట్టుడు గొప్ప రచయిత.'' ఆ తరువాత ప్రభాకర పండితుడు ఏదో పనిమీద వెళ్లిపోయాడు.

"బాణభట్టు భూర్జ పత్రాల మీద వ్రాసిన ఒక కథను మా నాన్నగారు చెప్పారు. బాణుని సంస్కృతాన్ని అర్థం చేసుకోవడం కష్టం. ప్రస్తుతం ఆయన హర్ష చక్రవర్తి చరిత్రను వ్రాస్తున్నాడు."

"మన రాజుగారి శైలి సులభ సుందరం. నేను నాగానంద నాటకం

చదివి ఆనందించాను. బోధి సత్వుడైన జీమూతవాహనుడు గరుత్మంతుని బారినుంచి నాగ జాతిని (పాములు) ఎలా కాపాడగలిగిందీ నాటకంలో చక్కగా చెప్పబడింది. పాములకు శత్రువు గరుత్మంతుడు. పైగా హర్షుని వ్రాత ముద్దులు మూటగడుతుంది" అన్నాడు వసుభూతి.

"నేను నలందా విశ్వవిద్యాలయానికి వెళ్లాలని అభిలషిస్తున్నాను. అక్కడి గ్రంథాలయంలో మూడు పెద్ద భవనాలలో వేలాది వ్రాత ప్రతులున్నాయి" అన్నాడు పుండరీకుడు.

"నేనూ నలందాకి వెళ్లాలనుకుంటున్నాను. ఉత్తరాపథము నంతటికీ వేళ చూపుతున్న అక్కడి నీటి గడియారాన్ని చూడాలని నాకోరిక" వసుభూతి చెప్పాడు.

"అందులో మనకు ప్రవేశం దొరుకుతుందో లేదో! నలందాలో చేరే విద్యార్థి విద్వాంసుడుగానే వుంటాడు. అక్కడి ద్వారపాలకులు కూడా చదువుకున్నవారే. వాళ్లుకూడా ప్రశ్న లడుగుతారు. ప్రతి సంవత్సరమూ పది మంది అభ్యర్థుల్లో ఏ యిద్దరికో ముగ్గురికో ప్రవేశం లభిస్తుంది."

"కాని 5,000 మంది విద్యార్థు లున్నట్లు చెపుతారు" అన్నాడు వసుభూతి.

"వాళ్లంతా భారతదేశం నుంచే కాక లంక, యవ ద్వీపం, సువర్ణ ద్వీపం (జావా సుమత్రాలు) మొదలైన దేశాలనుంచి కూడా వచ్చినవారు."

"ఒకవేళ ప్రవేశం దొరికినా, ఆఖరు పరీక్షల్లో కూడా నెగ్గాలి. అలా నెగ్గిన విద్యార్థుల్ని పూల మాలలతో అలంకరించి, ఏనుగుల మీద కూర్చోబెట్టి ఊరేగిస్తారు. నెగ్గనివారి ముఖాలకు మసి పూసి, గాడిదల మీద కూర్చోబెడతారని విన్నాను" అన్నాడు అయం.

"అలా అయితే, పుండరీకుడూ నేనూ నలందాకి వెళ్లకపోవడం మంచిది" అన్నాడు వసుభూతి.



## కనోజిలో మత సమావేశం

ప్రభాకర పండితుడు త్వర త్వరగా వస్తున్నాడు. ఆయన్ని వాళ్ళు ఆపారు. "నలందాని గురించి మాకు చెప్పండి" అడిగారు.

"పాశ్చాత్య విద్వాంసుడు యువాన్‌ద్వాంగ్‌కి సన్మాన సభ యేర్పాటు చెయ్యాలి" అని పండితుడు ఇంకా యిలా చెప్పాడు: "ఆయన నలందాకి యాత్రికుడుగా, విద్యార్థిగా వెళ్ళాడు. పండితుడుగా కీర్తి గడించారు. కులపతి శీలభద్రుడు ఆయనకి గొప్పగా స్వాగతం ఇచ్చారు. పూలూ పరిమళ ద్రవ్యాలూ చల్లుతూ 200 మంది సన్న్యాసులు ఊరేగింపుగా వెళ్లి ఆయన్ని లోపలికి తీసుకు వచ్చారు. జేగంట మోగించారు. నలందలో తనకు కావలసిన దేన్నయినా వాడుకో వచ్చునని ఆయనకి తెలియజేశారు."

"అయితే ఆయన నలంద నెందుకు విడిచిపెట్టినట్టు?" అడిగాడు పుండరీకుడు.

"ఉత్తర భారతంలోని రాజా

లందరూ అంత గొప్ప విద్వాంసుని తమ ఆస్థానంలో ఉంచుకోవాలని ఆశించారు. యువాన్‌చ్వాంగ్ నలందాకి చేరేముందు, ఆయన్ని కాశ్మీర రాజు ఎంతోఘనంగా ఆహ్వానించాడు. ఆయన నడిచిన దారిలో పూలు, సువాసన ద్రవ్యాలు చల్లించాడు. తన సంస్కృత జ్ఞానాన్ని వృద్ధి చేసుకునేందుకు, ఆయన రెండేళ్లు ఒక విహారంలో ఉన్నాడు. ముఖ్య బౌద్ధ గ్రంథాలను చైనాకి తీసుకు వెళ్లేందుకుగాను, వాటి ప్రతులను తయారు చేసేందుకు, 20 మంది వ్రాయసగాండ్రను రాజు నియమించాడు. నలందా చేరుకునేముందు, ఆయన ఎన్నో విహారాలు సందర్శించాడు. మన మహారాజూ కామరూప మేలే భాస్కరుడూ ఆయన ఉపన్యాసాలు వినాలని కుతూహల పడ్డారు. కాని యువాన్‌చ్వాంగ్ సవినయంగా తన అసమ్మతిని తెలిపి తన విద్యాభ్యాసానికి అంతరాయం కలగకూడదని వివరించాడు. భాస్కరుడు ఉగ్రుడైనాడు. నలందను బూడిదపాలు చేస్తానని బెదిరించాడు. అప్పటినుంచీ ఆయన భాస్కరుని ఆస్థానంలో ఉండసాగాడు. ఈ సంగతి మన మహారాజుకి తెలిసింది. వెంటనే భిక్షువుని పంపవలసిందిగా భాస్కరునికి సందేశం పంపారు. నా తలనైనా నేనిస్తాను గాని, నా అతిథిని మాత్రం పంపను - అని సమాధానం పంపాడు. ఇందుకు మన మహారాజు "అయితే నీ తలను పంపవలసింది" అన్నారు. అందువల్ల భాస్కరుడు యువాన్‌చ్వాంగుతో ఇక్కడికి వచ్చాడు. యువాన్‌చ్వాంగ్‌ని మహారాజు ఘనంగా ఆహ్వానించారు. ఆయన కృతులలో ఒకదాన్ని వివరించమని కోరారు. ఆయన ప్రసంగం విని మహారాజు ముగ్ధుడై ఒక మహా సభ ఏర్పాటు చేశారు. అందులో విద్వాంసులందరూ పాల్గొనవచ్చు. ఆ న్యాయశాస్త్ర పారంగతుని ఎవరైనా వాదంలో ఓడిస్తారేమో చూడాలని మహారాజు కోరిక. ఆయన యువాన్‌చ్వాంగ్‌కి న్యాయశాస్త్ర పారంగతుడనే బిరుదు ఇచ్చారు.

"ఆ మహాసభ కోసం అప్పుడే ఏర్పాట్లు జరుగుతున్నాయి. అతిథులందరికీ భోజన, గృహవసతులు చేశారు. కొన్ని వేలమంది బౌద్ధ

భిక్షువులు వచ్చారు. ఒక్క నలందనుంచే వెయ్యి మంది వచ్చారు. హర్షుని సామంతులు పద్దెనిమిదిమంది సపరివారంగా విజయం చేశారు, చక్రవర్తికి స్వాగతం చెప్పాలని. భాస్కరుడూ, వల్లభి నేలే ధ్రువసేనుడూ మహా రాజుతోనే ఉన్నారు. నగరానికి వెలుపల సభ యేర్పాటు చేయబడు తుంది. సభా ప్రాంగణం సింహద్వారం వద్ద పొడుగాటి స్తంభం ఒకటి నిర్మిస్తారు. యువాన్‌చ్వాంగ్ సభకు అధ్యక్షత వహిస్తారు. తన సిద్ధాంతం వివరించి, ఆయన దాన్ని ఖండించమని పండితుల్ని కోరుతాడు" అని ప్రభాకర పండితుడు సవివరంగా చెప్పాడు.

మహాసభ ప్రారంభ మయింది. పుండరీకుడూ అతని మిత్రులూ సభా ప్రాంగణంలోకి వెళ్లగలిగారు. తెల్లని గుడ్డమీద ఎర్రని అక్షరాలలో యువాన్‌చ్వాంగ్ ప్రతిజ్ఞలు వ్రాయబడినవి. దాన్ని సింహద్వారం వద్ద కట్టే బాధ్యత పుండరీకుడిది. ఒక ఉన్నత స్తంభం మీద బంగారంతో చేయబడిన బుద్ధ విగ్రహం ఉంచబడింది. స్తంభం కింద యువాన్‌చ్వాంగ్ మొదలైన వారికి ప్రత్యేకంగా ఆసనాలు అమర్చారు.

చర్చ నాలుగు రోజులపాటు సాగింది. మహాయాన బౌద్ధమును సమర్థిస్తూ యువాన్‌చ్వాంగ్ స్పష్టంగా తన వాదం తెలియజేశాడు. ఆయన వాదం చక్రవర్తికి, రాజ్యశ్రీకి నచ్చింది.

ఆయనవలె వాదించలేని ప్రత్యర్థులు ఉగ్రులయారు. ఆయన్నీ చక్ర వర్తినీ విమర్శించసాగారు. చివరికి పిల్లల్లోకూడా వాదోపవాదాలుసాగాయి.

"ఆ విదేశ విద్వాంసుని ఎవ్వరూ ప్రతిఘటించరు. ఎందుకంటె, చక్రవర్తి తమను శిక్షిస్తాడేమో అని వాళ్ల భయం" అన్నాడు అయం.

"మా నాన్నా, బాణభట్టూ, కామరూపం ప్రభువూ బ్రాహ్మణులే. వీళ్ళు బౌద్ధ మతాన్ని అంగీకరించలేదు. నిజమైన ప్రత్యర్థి శిక్షను చూసి భయపడక్కర్లేదు. యువాన్‌చ్వాంగ్ నిజమైన పండితుడు. సహర్షంగా నేర్పుతాడు; నేర్చుకుంటాడు కూడా" అన్నాడు పుండరీకుడు.

## యువాన్ చ్వాంగ్ తరలిపోవుట

ఒక సంవత్సరం తర్వాత, యువాన్‌చ్వాంగ్ స్వదేశానికి ప్రయాణ మైనాడు. ఆ ముగ్గురు కుర్రవాళ్లు ఆయనకు వీడ్కోలు చెప్పడానికి ఆయన ఆశీస్సులు పొందడానికి వెళ్ళారు.

"మీరింకా కొంతకాలం వుండరా, స్వామీ? చక్రవర్తీ, భాస్కరుడూ మిమ్మల్ని అర్థించినట్లు మా నాన్నగారు చెప్పారు" అన్నాడు పుండరీకుడు.



"అందరూ నాయందు ఎంతో దయ చూపారు. కాని ఏ సంపద కోసం నేనిక్కడికి వచ్చానో, దాన్ని మా దేశం తీసుకువెళ్ళాలి."

"మీకు మా మహారాజుగారు ఎన్నో కానుకలు సమర్పిస్తారు" అన్నాడు అయం.

"యాత్రికుడు సొంత కానుకలు కోరడు. కాని నేను మా విహారం కోసం, ప్రజల కోసం గొప్ప సంపదను తీసుకు వెళుతున్నాను. 650 సంస్కృత వ్రాతప్రతులూ, బుద్ధదేవుని ప్రతిమలూ అవశేషములూ తీసుకు వెళుతున్నాను" అన్నాడు భిక్షువు.

"వర్తకుల కోసరం మీరేమన్నా ఎదురు చూస్తున్నారా, స్వామీ" అడిగాడు వసుభూతి.

"లేదు. నేను వచ్చినట్టుగా, ఒంటరిగానే వెడతాను. దయాస్వభావులైన మీ రాజులు ఉత్తర దేశపు రాజులకిమ్మని, తెల్లని నూలుగుడ్డ మీద వ్రాసిన, ఎర్రని లక్కలో మహారాజుగారి ముద్రవేసిన ఉత్తరాలు నాకిచ్చారు."

వసుభూతి "మళ్ళీ మీరెప్పుడు వస్తారు, స్వామీ" అని అడిగాడు.

"పధ్నాలుగేళ్ళయింది మా దేశం నుంచి బయలుదేరి. నేను తీసుకువెళుతున్న గ్రంథాలను అనువదించాలి; వాటిని వివరించాలి. ఇందుకు, మిగిలిన నా జీవితకాలాన్ని వినియోగిస్తాను. కాని బుద్ధుని మాతృభూమి అయిన యీ దేశంలో నాకు లభించిన గౌరవాన్నీ ప్రజల స్నేహభావాన్నీ నే నెప్పుడూ జ్ఞాపకం ఉంచుకుంటాను" అన్నాడు భిక్షువు.

Printed at New Age Printing Press, New Delhi-110055.